విస్తృత శ్రమవిభజన ద్వారా ఒకటి చేసిన పెట్టుబడి - ఉత్పత్తి ఫలాన్ని మాత్రం సమాజపరం చేయకుండా వ్యక్తుల ఆస్తిగానే ఉంచేసింది.

ఈ వైరుధ్యాలను అధిగమించగల వర్గమే చరిత్రను ముందుకు తీసుకుపోయి నిజమైన మానవచరిత్రకు ప్రాతిపదిక అయిన సమష్టి ఉత్పత్తి వ్యవస్థను నెలకొల్పుతుంది. అది, పెట్టుబడిదారీ ఫ్యాక్టరీలోనే పుట్టిన కార్మిక వర్గం. కార్మిక వర్గం ఉత్పత్తి క్రియనే కాక ఉత్పత్తి ఫలాన్ని కూడా సామాజికం చేస్తుంది. ఆ ప్రాతిపదికన ఉత్పత్తి శక్తుల నిరంతర ఎదుగుదలను సాధిస్తుంది. దీని కోసం కార్మిక వర్గం చేసే పోరాటం ఒక రాజకీయ పోరాటం. అది కార్మికవర్గ పాలన నెలకొనడంతో ఒక కొలిక్కి వస్తుంది. (ఈ పాలన వర్గనియంతృత్వంగా ఉంటుందన్న భావన మేనిఫెస్టోలో లేదు. తరువాత కాలంలో - మార్క్స్ రచనలలోనే - వచ్చింది) ఆపైన జాతి విభేదాలు, ఒక జాతిపైన మరొక జాతి పెత్తనం, స్త్రీ పైన పురుషుడి పెత్తనం (ఇవి మేనిఫెస్టో ప్రత్యక్షంగా పేర్కొనే విషయాలు) మొదలైన అన్ని రకాల అసమానతలూ తొలగిపోవడానికి కావలసిన ప్రాతిపదిక ఏర్పడుతుంది.

మేనిఫెస్టో ఘంటాపథంగా చెప్పే విషయాలలో సందేహాస్పదమైనవి చాలా ఉన్నాయి. ఈ 150 సంవత్సరాల చరిత్ర ఏం చెప్తుందంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థ తరచుగా సంక్షుభితంగా ఉన్నప్పటికీ అది ఉత్పత్తి శక్తులను నిరంతరం అభివృద్ధి చేస్తూనే ఉంది. ఎటొచ్చీ అభివృద్ధి అనేక విషయాలలో అమానవీయ రూపం తీసుకోవడమే కాక పర్యావరణాన్ని ధ్వంసం చేస్తున్నది. అంటే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి నిలిచిపోవటం సమస్య కాలేదు. అది వికృత రూపం తీసుకోవటం సమస్య అయింది. ఇప్పుడు కావలసినది మరింతగా ఉత్పత్తిశక్తులను అభివృద్ధి చేసే వ్యవస్థా లేక ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని పర్యావరణ పరిరక్షణకు అనుకూలంగా నియంత్రించి అభివృద్ధి వేగాన్ని మందగింపచేసి, జరిగిన ఉత్పత్తి అందరికీ అందేటట్లు చూసే వ్యవస్థా అనేది ఈనాటి ప్రశ్న.

రెండవది, పెట్టుబడి సృష్టించిన ఉత్పత్తిశక్తులను సమష్టి ప్రాతిపదికన పునర్నిర్మాణం చేసి నిరంతరాయంగా ముందుకు తీసుకుపోగల వర్గం చేతిలోనే భవిష్యత్తు ఉందనే ఈ సిద్ధాంతం అన్ని పీడిత వర్గాలలోకీ పారిశ్రామిక కార్మిక వర్గానికి పెద్ద పీట వేసింది. రైతాంగం, చేతివృత్తుల వారు గతాన్ని అంటిపెట్టుకున్న తిరోగామి వాదులుగానూ, మతం వంటి భావజాల వ్యాప్తికి అనువయిన సరుకుగానూ కనిపించగా, ఆర్థికేతర పీడన అనుభవించే ప్రజల స్థానం ఏమిటో

అర్థం కాదు. ఆ పీడనలన్నిటినీ పెట్టుబడి ఒక బుల్‌డోజర్ లాగ కూలదోసి ఆస్తిలేని వారినందరినీ వట్టి కార్మికులుగా (జాతిలేని, ప్రాంతంలేని, జెండర్‌లేని, కులంలేని వట్టి శ్రమ విక్రేతలుగా) మారుస్తుందన్న భరోసాతో వాటి గురించి ఆలోచించడం అనవసరం అయిపోయింది.

కానీ నిజానికి పెట్టుబడి అంతటి బుల్‌డోజర్‌గా పనిచేయలేదు. చేయవలసిన అవసరం దానికి లేదు. మరి పారిశ్రామిక కార్మికులు నిర్మించబోయే సమష్టి ఉత్పత్తి వ్యవస్థ అన్ని ఆధిపత్యాలను అంతం చేస్తుందని నమ్మగలమా? నమ్మడానికి హేతుబద్ధమైన కారణాలేవీ లేవు. అది తప్ప వేరే ప్రత్యామ్నాయం లేదన్న మార్క్స్ ఆలోచన సహేతుకమైనదే. అది ఏ రూపంలో, ఏ విధంగా సాధ్యం అవుతుందన్న ప్రశ్న 20వ శతాబ్దపు కమ్యూనిస్టు ప్రయోగాల వైఫల్యాల నుండి మనకు మిగిలింది. అయితే అది ఏ రూపంలో సాధ్యమైనా దానినుండి మిగిలిన మార్పులన్నీ రావు. రాకపోగా అవి దీనికి ప్రతిబంధకాలవుతాయి. దేనికోసం జరగవలసిన ప్రయత్నం దానికోసం జరగవలసిందే. ఈ ప్రయత్నంలో 'అగ్రగామి' ఏదీ లేదు. ఎవరూ లేరు. ఉందనుకోవడానికి సహేతుకమైన కారణమేదీ లేదు. అన్ని ప్రయత్నాల ప్రజాస్వామిక సమాహారంగా ప్రగతిశీల రాజకీయ కృషి సాగాలి. ఇందులో అగ్రగామి అన్న భావనకు గానీ ఒకరి నియంతృత్వానికి గానీ తావు ఉండదు. ఈ ప్రయత్నం గడచిన చరిత్రలో ముందుకొచ్చిన నాగరికతా విలువలనూ నియమాలనూ 'భావజాలం' అని కొట్టి పారేయకుండా, వాటిలోని ప్రజాస్వామిక అంశాలను స్వీకరిస్తుంది, పెంపొందిస్తుంది. సమాజ పునర్నిర్మాణంలో భాగం చేస్తుంది.

'నూటయాభై సంవత్సరాల కమ్యూనిస్టు ప్రణాళిక' పుస్తకంలో వచ్చిన వ్యాసం

సమీక్ష ప్రచురణలు, ఆగస్టు 1998

V

# కొత్త ఉద్యమాలు - పాత సిద్ధాంతాలు



ఈ మధ్య కాలంలో మన రాష్ట్రంలో కొన్ని కొత్త ఉద్యమాలు ముందు కొచ్చాయి. వాటిని 'అస్తిత్వ ఉద్యమాలు'అనీ, 'గుర్తింపు రాజకీయాలు' అనీ విశ్లేషకులు పిలుస్తున్నారు. ఈ పేర్లు ఆ ఉద్యమాలు తమకు తాము పెట్టుకున్నవి కావు. విశ్లేషకులు పెట్టినవి. Politics of Identity అనే ఇంగ్లీష్ ప్రయోగానికి అనువాదంగా ఈ పేర్లు వచ్చి నట్లున్నాయి. కానీ ఆ ఇంగ్లీష్ ప్రయోగమైనా, ఈ తెలుగు అనువాదమైనా ఆ ఉద్యమాలన్నిటి స్వభావాన్నీ సరిగ్గా వ్యక్తం చేస్తాయా అంటే సందేహమే.

ఒక ప్రత్యేకమైన సాంఘిక సాంస్కృతిక స్వభావంగల ప్రజలు తమ ప్రత్యేకతను కాపాడుకోవడం కోసం చేసే ఉద్యమాలకు ఆ పేరు పెట్టవచ్చును. ఉదాహరణకు బ్రిటన్‌లో ఐరిష్ ప్రజల పోరాటం. ఈశాన్య భారత ప్రాంతంలోని నాగా తదితర జాతుల పోరాటాలకు, కాశ్మీర్ పోరాటానికి కూడా ఈ పేరు చాలావరకు సరిపోతుంది. ఆ అర్థంలో మన దగ్గర కొత్తగా ముందుకొచ్చిన ఉద్యమాలేవీ అస్తిత్వ ఉద్యమాలు - ఐడెంటిటీ స్ట్రగుల్స్ - కావు. వాటికి ప్రాతిపదిక అయిన ప్రజలకు - స్త్రీలు, దళితులు, ఆదివాసులు, మాదిగలు - ఒక ప్రత్యేకమైన సాంఘిక సాంస్కృతిక ఉనికి ఉన్న మాట సత్యం. ఆ ఉనికి వారి ఆకాంక్షలకు మూలం. ఆ ఉనికి అందిచ్చిన గొంతులో ఆ ఆకాంక్షలు వ్యక్తం అవుతున్నాయి. అయితే ఆ ఉనికిని వ్యక్తం

చేయడమే వారి ఆకాంక్ష కాదు. అందులోని అణచివేతనూ అసమానతనూ అధిగమించడం వారి ఆకాంక్ష. ఎటొచ్చీ దానికి కావలసిన శక్తినీ దృష్టినీ ఆ ప్రజలు తమ ఉనికి నుండి పొందుతూ దానిని సిద్ధాంతీకరిస్తున్నారు. ఈ పరిమితమైన అర్థంలో వారి పోరాటాలను 'అస్తిత్వ పోరాటాలు' అని వర్ణించినా వాటిలోని అణచివేత వ్యతిరేక స్వభావాన్నీ, విముక్తి కాంక్షనూ ఆ పేరు స్ఫురింపచేయదు.

కొన్ని పోరాటాలలో తమ ప్రత్యేకమైన ఉనికిని - తమ అస్తిత్వాన్ని నిర్వచించే విశిష్టతను కాపాడుకునే ఆకాంక్ష కొంత ఉన్నమాట వాస్తవమే. ఉదాహరణగా తెలంగాణ ఉద్యమాన్ని తీసుకోవచ్చును. భాషా సంస్కృతులలో తెలంగాణకు ఉన్న విశిష్టత ఉమ్మడి 'తెలుగుతనం' అనే ఆధిపత్య భావనలో మునిగిపోయి తన ప్రత్యేకతను కోల్పోకుండా ఉండాలన్న ఆరాటం తెలంగాణ ఉద్యమంలో ఉంది. కానీ అదొక్కటే దానికి ప్రేరణ కాదు. సాగునీటి నుండి విద్య వరకు వివిధ రంగాలలో తెలంగాణకు జరిగిన అన్యాయం ఉంది. అది తెలంగాణ ఉద్యమానికి ఒక ముఖ్య ప్రేరణ. వీటిలో ఏది అన్నిటికంటె ముఖ్యమైన ప్రేరణ అనే చర్చ ప్రస్తుతానికి అనవసరం గానీ అది కేవలం 'అస్తిత్వ పోరాటం' కాదు, 'గుర్తింపు రాజకీయం' కాదు. ఏజెన్సీ ఆదివాసీల పోరాటంలో కూడా ఆదివాసీల జీవన శైలికి సంబంధించిన ఆరాటం ఉంది. ప్రకృతితో వైరి సంబంధం ఉన్న పెట్టుబడిదారీ జీవనశైలికీ, ప్రకృతితో స్నేహ సంబంధం ఉన్న ఆదివాసీ జీవన శైలికీ మధ్యనున్న వైరుధ్యం ఆ పోరాటంలో ఒక అంశమే. అయితే దానితోబాటు భూమి పరాయీకరణ, సంక్షేమ చట్టాల అమలులోని వైఫల్యం, విద్యావకాశాల లేమి మొదలయిన అంశాలూ ఉన్నాయి. అది పాక్షికంగా మాత్రమే 'అస్తిత్వ పోరాటం'.

తక్కిన కొత్త ఉద్యమాలలో 'అస్తిత్వ పోరాటం' లక్షణం ఈ మాత్రం కూడ లేదు. అన్నీ కూడ సాంఘిక ఆర్థిక రాజకీయ వివక్షనూ, అసమానతకూ, అణచివేతకూ వ్యతిరేకంగా ముందుకొచ్చిన పోరాటాలే. అన్నీ మన సామాజిక వ్యవస్థలోని ఏదో ఒక ప్రత్యేకమైన స్థానం గల ప్రజాసమూహం జీవిత అనుభవం నుండి, ఆకాంక్షల నుండి పుట్టిన పోరాటాలనేది వాస్తవమే. ఆ అనుభవం నుండి పుట్టిన ప్రత్యేక దృక్కోణం కలిగిన పోరాటాలనేది కూడ వాస్తవమే. కానీ వాటి లక్ష్యం ఆ అనుభవ ప్రత్యేకతను వ్యక్తం చేయడం, నిలబెట్టుకోవడం లేక కాపాడుకోవడం మాత్రమే కాదు (తెలంగాణ ఉద్యమంలోనూ, ఆదివాసీల ఏజెన్సీ పోరాటంలోనూ ఆ లక్ష్యం కొంతమేరకు ఉన్నప్పటికీ). ఆ జీవిత అనుభవంలోని అణచివేతనూ అసమానతనూ అధిగమించి

సమానత్వాన్నీ అణచివేత లేని జీవితాన్నీ (కనీసం ఆ మేరకు) సాధించాలనే ఆకాంక్ష వాటి లక్ష్యంలో ఒక ముఖ్య అంశం.

కేవలం తమ చారిత్రక సాంస్కృతిక ప్రత్యేకతనూ, విశిష్టతనూ నిలబెట్టు కోవాలనే ఆకాంక్ష, ఆ కళ్ళతో చూసినప్పుడు కనిపించే సత్యాన్ని వ్యక్తం చేయాలనే ఆరాటం ఉండదనీ, ఉండకూడదనీ నా ఉద్దేశ్యం కాదు. అటువంటి ఆకాంక్షనూ, ఆరాటాన్నీ సానుభూతితో చూడకూడదనీ సమర్థించకూడదనీ అసలే కాదు. కాశ్మీర్ పోరాటం ప్రధానంగా ఆ కోవకు చెందినదే. అది పూర్తిగా సమర్థనీయమైన పోరాటం. అయితే మన రాష్ట్రంలో 'అస్తిత్వ పోరాటాలు', 'గుర్తింపు రాజకీయాలు' అనే పేరుతో పిలువబడుతున్నవేవీ (పూర్తిగా) ఆ కోవకు చెందినవి కావు. సాంఘిక ఆర్థిక అణచివేత కంటే జీవిత అనుభవంలోనూ జీవన విధానంలోనూ ఉన్న విశిష్టతకూ, సత్యాసత్యాల కంటే దృక్కోణంలోని ప్రత్యేకతకూ అన్ని సందర్భాలలోనూ ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలనే వైఖరి పోస్ట్ - మోడరన్ తాత్విక ధోరణి నుండి వచ్చినది. వీటి ప్రాముఖ్యాన్ని బాగా తక్కువ చేసే సంప్రదాయక వామపక్ష ధోరణికి అది అందిచ్చే సవరణ అవసరమే. కానీ దానిని నిర్విమర్శగా స్వీకరించనవసరంలేదు. ఒక్కొక్క ఉద్యమానికి ఉన్న వాస్తవ స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. అన్ని పోరాటాలనూ ఆర్థిక సంబంధాలకు కుదించడం ఎంత తప్పో అన్నిటినీ అస్తిత్వ ప్రత్యేకతకూ అనుభవ విశిష్టతకూ కుదించి వేయడం అంతే తప్పు.

మరి ఆంధ్రప్రదేశ్‌లో ఈ మధ్య కొత్తగా ముందుకొచ్చిన ఉద్యమాలను ఏ విధంగా అర్థం చేసుకోవాలి? వాటికి ఏ పేరు పెట్టాలి? వాటికన్నిటికీ ఏదో ఒకే పేరు పెట్టగలుగుతామని నేను అనుకోను. నెగటివ్‌గా వాటిని 'వర్గేతర' రాజకీయాలు అనవచ్చును. అవి మనకు 'కొత్తవి' గా కనిపించడానికి కారణం ఇక్కడే ఉందేమో. వర్గ రాజకీయాలే శాస్త్రీయమైన రాజకీయాలనీ తక్కినవన్నీ తప్పుడు అవగాహన నుండి (వాటి వెనుక ఉన్న ఆరాటం ఎంత న్యాయమైనదైనా) పుట్టినవనీ దాదాపు మూడు తరాలుగా తెలుగునాట అభ్యుదయవాదులు (మెజార్టీగా) నమ్ముతున్నారు. అది నిజం కానవసరం లేదని మనకు నేర్పడమే (కనీసం సందేహం కల్గించడం) ఈ ఉద్యమాలలోని నవ్యత. అందుకే అవి మనకు 'కొత్తవి'గా కనిపిస్తున్నాయి. లేకపోతే వాటిలో కొత్తదనమేమీ లేదు. ఆదివాసీలు రామాయణ కాలం నుండి మైదాన ప్రాంతాల వారి చొరబాటుకు వ్యతిరేకంగా పోరాటాలు చేస్తున్నారు. ఆ పోరాటం జీలుగుమిల్లిలో మొదలుకాలేదు. శూద్రులు బ్రాహ్మణాధిక్యతకు వ్యతిరేకంగా వర్ణ

వ్యవస్థ పుట్టినప్పటినుండి పోరాటాలు చేస్తున్నారనడానికి చారిత్రక ఆధారాలున్నాయి. స్త్రీలు ప్రతీ యింట్లోనూ మగపెత్తనానికి వ్యతిరేకంగా నాగరికత పుట్టినప్పటినుండి ఘర్షణ పడుతూనే ఉన్నారు. ఈ పోరాటాలన్నీ మనకు ఈరోజు 'కొత్తవి' గా కనిపించడానికి కారణం మనకు అవి నేర్పుతున్న కొత్త సిద్ధాంత దృక్పథం.

దీనిని కొంచెం వివరంగా చూద్దాం.

1985 తరువాత మన రాష్ట్రంలో కొత్త సమస్యలపైన ముందుకొచ్చిన ఉద్యమాలలో అత్యధిక భాగం ఏ రాజకీయపార్టీ నాయకత్వాన (సిపిఐ - ఎంఎల్ పార్టీలతో సహా) రాలేదు. (పాత ఉద్యమాలు కొత్త ప్రాంతాలకు విస్తరించి ఉండవచ్చును గాక). దీనికి రెండు మినహాయింపులు రాయలసీమ జిల్లాల్లో సాయుధ ముఠాల ఆధిపత్యానికి వ్యతిరేకంగా వచ్చిన ఆందోళన, జైలు ఖైదీల హక్కుల పోరాటం. ఇవి రెండూ మార్క్సిస్ట్-లెనినిస్ట్‌ల ప్రేరణతో వచ్చాయి. కాని ఇవి మినహాయింపులు మాత్రమే. 1985లో దళిత మహాసభ ఆవిర్భావంతో మొదలుపెట్టి, సిద్ధాంత తాత్విక రంగాలలో దళిత మేధావులు, ఫెమినిస్టులు చేపట్టిన చర్చ, ప్రచారోద్యమాలు, సారా వ్యతిరేక మహిళా పోరాటం, ఏజెన్సీలో ఆదివాసీల 1 ఆఫ్ 70 పోరాటం, మాదిగ హక్కుల పోరాటం, కోయల తుడుందెబ్బ, తెలంగాణ ఉద్యమం మొదలైనవన్నీ రాజకీయ పార్టీ వ్యవస్థకు వెలుపల వచ్చిన ఉద్యమాలే.

ఇవన్నీ వర్గేతర రాజకీయ సమీకరణలేనన్న 'కొత్తదనం' (అంటే ఇప్పటివరకు ఉన్న రాజకీయ కామన్‌సైన్స్‌కు కొత్తగా తోచే లక్షణం) మాత్రమే కాక, ఈ ఉద్యమాలను ఏ రాజకీయ పార్టీ మొదలుపెట్టలేదనే కొత్తదనం కూడ వీటిలో ఉంది. సమాజాన్ని శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించి, సమస్యలను గుర్తించి, వాటి పరిష్కారం కోసం సంబంధిత ప్రజలను సమీకరించే శాస్త్రీయ దృక్పథంగల రాజకీయ పార్టీ నాయకత్వాన మాత్రమే ప్రగతి నిర్దుష్టంగా సాధ్యం అవుతుందనేది వామపక్ష రాజకీయాలలో ప్రబలంగా ఉన్న ఆలోచన. ఎక్కడన్నా ఒకటీ అరా ఉద్యమాలు తమంతటతాము ఆవిర్భవించినా, శాస్త్రీయ దృక్పథంగల రాజకీయ పార్టీ వెనువెంటనే స్పందించి దానిని తన చేతిలోకి తీసుకొని దానికి సమగ్రమైన ప్రాపంచిక దృక్పథం నేర్పించి నడిపించాలనీ, నడిపిస్తుందనీ, అది జరిగినప్పుడే ఆ ఉద్యమం నిజమైన అర్థంలో ప్రగతిపథంలోకి వస్తుందనీ వామపక్ష దృక్పథం నమ్ముతూ వచ్చింది. ఉద్యమ పురోగమన క్రమం ఈ విధంగానే ఉంటుందనీ, అంతకంటే భిన్నంగా ఎక్కడయినా జరిగితే ఆ ఉద్యమ క్రమం లోపభూయిష్టమయినదనీ వామపక్షవాదులు నమ్ముతూ వచ్చారు.

ఈ కొత్త ఉద్యమాలు ఒక కొత్త పురోగమన క్రమాన్ని మన ముందుంచాయి. అణచివేత, అసమానత రకరకాల రూపాలలో ఉంటాయి. వాటినన్నిటినీ సైద్ధాంతికంగా ఆకళింపు చేసుకొని అన్నిటికీ వ్యతిరేకంగా ఉద్యమాలను ఒకేతాటిన నిర్మించ గల రాజకీయ పార్టీ ఒకటి ఉండడం కష్టమే. పార్టీలు నమ్మే రాజకీయ సిద్ధాంతాలు తమ దృక్పథాన్ని సార్వజనీన సూత్రాల రూపంలో ప్రకటించవచ్చును గానీ, వాటి వెనకనున్న జీవిత అనుభవం సార్వజనీనం కాదు. అది అప్పటికి చరిత్రలో ముందుకొచ్చిన - అంటే రాజకీయంగా తనను తాను వ్యక్తం చేసుకున్న అనుభవం మాత్రమే. 'కొత్త అనుభవాన్ని ప్రజలనుండి నేర్చుకుంటాం' అని ఆ పార్టీ అనవచ్చును. నిజాయితీగానే నమ్మవచ్చును. కానీ ఆ కొత్త అనుభవం నిజానికి పాత అనుభవానికి కొన్ని కొత్త వివరాలను చేర్చే కొనసాగింపు మాత్రమే అయినప్పుడు తప్ప ఈ 'నేర్చుకోవడం', 'నేర్చుకొని దానికి శాస్త్రీయ రూపం ఇచ్చి ప్రజలకు అందియ్యడం' సులభంగా జరగదు. విభిన్న జీవిత అనుభవాలలోనూ అసమానతలలోనూ నిజంగానే భిన్నత్వం, వైవిధ్యం ఉంటుందని గుర్తించినట్టయితే, 'ప్రజలనుండి నేర్చుకోవడం' అనేది అనివార్యంగా సంఘర్షణాత్మకంగా ఉంటుందని అర్థం అవుతుంది. కొత్త జ్ఞానం పాత జ్ఞానాన్ని సవాలు చేస్తుంది. పాత జ్ఞానం కొత్త జ్ఞానాన్ని సులభంగా ఆకళింపు చేసుకొని ఆ కొత్త ప్రజలతో సులభంగా మమేకమై వారి ఆకాంక్షలకు తన దగ్గరున్న 'శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథాన్ని' అందివ్వడం జరగదు. అంటే పైన వివరించిన ఉద్యమ పురోగమనక్రమం సందేహాస్పదమైనది.

మరి ఈ ఉద్యమాలు నేర్పే ప్రత్యామ్నాయం ఏమిటి? ఆయా జీవిత రంగాలలో అణచివేతకూ అసమానతకూ గురయ్యే ప్రజల జీవిత అనుభవం నుండి ఉద్యమాలు పుట్టడం, ఆ ప్రజలను సమీకరించే లక్ష్యంతో ఉద్యమ సంస్థలు పుట్టి పోరాటాలు నిర్వహించడం అత్యంత ప్రాథమికమైన క్రమం. పోరాటాలను ప్రజలతో సమానం చేసి చూడడంలో ఉన్న ఇబ్బందిని పక్కనపెట్టి మామూలుగా అలవాటయిన (అతిశయోక్తితో కూడుకున్న) భాషలో చెప్పాలంటే, ఇవి ఆ ప్రజలు తమకోసం తాము చేసుకునే పోరాటాలు. (అయితే తమ ఉనికిలోని ప్రత్యేకతను నిలబెట్టుకునే పోరాటం - అంటే అస్తిత్వ పోరాటం - కావచ్చును, కాకపోవచ్చును, పాక్షికంగా కావచ్చును). ఇటువంటి భిన్నమైన పోరాటాలు ప్రగతి గురించి, అభ్యుదయాన్ని గురించి కొత్త ఆలోచనలను తీసుకొస్తాయి. పాత సమాజం మీద కొత్త కోణం నుండి విమర్శ పెడతాయి. అంతేకాదు, అప్పటివరకు గుర్తింపు పొంది ఉన్న అభ్యుదయ భావనపైన కూడ విమర్శ పెడతాయి. దానికి సరళంగా 'నేర్పించవు'. అది సరళంగా 'నేర్చుకోదు'.

సంఘర్షణ జరుగుతుంది. సంఘర్షణాత్మకంగానే ఇరుపక్షాలూ నేర్చుకుంటాయి. బాధ్యతాయుతంగా వ్యవహరిస్తే మరీ ఎక్కువ విధ్వంసం లేకుండా నేర్చుకోవడం జరుగుతుంది. లేకపోయినా నేర్చుకోవడం మాత్రం జరుగుతుంది. ఈ విధంగా ఉద్యమాలలోనూ ఉద్యమ సిద్ధాంతాలలోనూ వచ్చే మార్పుల సమాహారమే ప్రగతి, ప్రగతిశీలక ప్రాపంచిక దృక్పథం. ఇది ఉద్యమాల పురోగమన క్రమమే తప్ప 'ఉద్యమ పురోగమన క్రమం' కాదు. ఉద్యమం అని ఏకవచనంలో అనడం కమ్యూనిస్టు సంప్రదాయంలో ఎంత సహజమో, ఉద్యమాలు అని బహువచనంలో అనడం ఈ కొత్త ఉద్యమాలు నేర్పిస్తున్న దృక్పథంలో అంతే సహజం.

గత దశాబ్దకాలంగా ఆంధ్రప్రదేశ్‌లో ముందుకొచ్చిన కొత్త ఉద్యమాలనూ వాటితో కమ్యూనిస్టు పార్టీలకూ, మేధావులకూ ఉన్న సంబంధాన్నీ పరీక్షిస్తే, ఈ రెండవ పురోగమన క్రమమే సహజం అనే వాదనకు బలం చేకూరుతుంది. (లేదంటే, ప్రస్తుతం నడుస్తున్న చారిత్రక దశే గాడి తప్పిన దశ అనీ-ఉద్యమ చరిత్ర కంటున్న పీడకల అనీ-అది గడిచి చరిత్ర తిరిగి గాడిమీదకి వచ్చేదాకా వేచి వుండాలి తప్ప గాడి తప్పిన చరిత్రను సిద్ధాంతీకరించ కూడదనీ అనుకోవలసి ఉంటుంది). ఎందుకంటే ఈ ఉద్యమాలు ముందుకు తీసుకొచ్చిన సమస్యలు, ఆరాటాలు, ఆకాంక్షలు సమాజంలో ఉన్నాయన్న ఎరుకే కమ్యూనిస్టు పార్టీలకూ మేధావులకూ - అత్యంత క్రియాశీలక స్వభావంగల వారిగా తమ గురించి తాము భావించే మార్క్సిస్టు-లెనినిస్టులతో సహా - ఉండలేదు. ఉదాహరణకు కోస్తా ఆంధ్ర జిల్లాలో ఇప్పట్లో 'ఉద్యమం' రావడం సాధ్యం కాదని ఎం.ఎల్ పార్టీలూ ఆ పార్టీలకు సన్నిహితులయిన మేధావులు (నాతో సహా) కారంచేడు జరిగేదాకా నమ్ముతూ వచ్చారు. తెగించి వ్యాసాలు రాసారు కూడ. ఒక్కొక్క విషయంలోనూ ఆ సమస్యను అనుభవించి దానిని ప్రతిఘటించే చైతన్యం, దానిని అంతమొందించాలన్న ఆరాటం పెంచుకున్న ప్రజలే కళ్ళు తెరిపించవలసి వచ్చింది.

ఆ తరువాత కూడ - సిద్ధాంత ప్రకారం జరుగవలసి ఉన్నట్టు - ఆ ఉద్యమాలను కమ్యూనిస్టులు తమ చేతిలోకి తీసుకొని వాటి 'తప్పుడు చైతన్యాన్ని' సవరించి వాటిని 'సరయిన దారిలో, నడిపించడం జరగలేదు. ఎక్కువ భాగం పరస్పర అనుమానంతోనే గడిచింది. కొంతకాలం తరువాత సంఘీభావం తెలపడం, ఐక్యఉద్యమాలలో భాగం పంచుకోవడం జరుగుతూ వచ్చింది. అయినప్పటికీ సందేహాలూ, విమర్శలూ, విభేదాలూ, కొనసాగుతూనే ఉన్నాయి. విభేదమే ప్రధానంగా ఉండి ఎత్తుగడల మేరకు మాత్రమే ఐక్యత ఉందంటే అతిశయోక్తి కాదు.

వామపక్ష పార్టీలు ఈ కొత్త ఆరాటాలనూ, ఆకాంక్షలనూ చూడలేక పోవడానికి గల ఒక కారణం ఇప్పటికే బాగా చర్చకు వచ్చింది. అదేమిటంటే ఆ పార్టీల నాయకులూ మేధావులూ ఒక పరిమితమైన (అందులోనూ ఆధిపత్య స్వభావం గల) జీవిత అనుభవం నుండి వచ్చిన వారన్న వాస్తవం. తాగివచ్చిన మొగుడి చేతిలో తన్నులు తిన్న అనుభవం ఉన్న స్త్రీ లెవరూ నాయకత్వ స్థానంలో లేని పార్టీలు సారా వ్యతిరేక మహిళా పోరాటాన్ని ఊహించగలవా? వాళ్ళు నిర్మించిన పోరాటం అందుకనే మగ మిలిటెంట్ల మెరుపుదాడుల పోరాటంగానో లేక పార్టీల నిర్మాణంలోని అత్యంత బలహీన విభాగమైన మహిళా సంఘాల ఆందోళనగానో ఉండిపోయింది. అంటరానితనాన్ని తమ జీవితంలో అనుభవించిన వారెవ్వరూ నాయకత్వ స్థానంలో లేని పార్టీలు - ఆ అనుభవం స్వయంగా ఎరుగని మేధావులు- దళితులలో ఆత్మగౌరవ ఆకాంక్ష, సాంఘిక సమానత్వ ఆకాంక్ష ఎంత బలంగా ఉన్నాయో అర్థం చేసుకోగలరా? అందుకే వెట్టిచాకిరీ వంటి మధ్యయుగాల దోపిడీ రూపాలు అంతమైన సర్కార్ జిల్లాల్లో ప్రజాతంత్ర పోరాటాలకు పెద్దగా ఆస్కారం లేదని అనుకున్నాము. ఇవి న్యాయమైన ప్రశ్నలే. సిద్ధాంతం కేవలం తర్కానికి సంబంధించిన విషయం కాదు. సిద్ధాంత అన్వయం కేవలం తార్కిక శక్తికీ, విషయ పరిజ్ఞానాన్ని బయటినుండి స్వీకరించడంలో ఉండే సామర్థ్యానికీ సంబంధించిన విషయం కాదు.

ఆ రెండింటితో బాటు (అవి అనవసరం అని కాదు) జీవిత అనుభవం కూడ ముఖ్యమైన విషయమే. ఏ జీవితానికయితే సిద్ధాంతాన్ని అన్వయిస్తున్నామో ఆ జీవితాన్ని అనుభవించిన వాళ్ళయితేనే ఆ పని సమర్థవంతంగా చేయగలరు. ఇతరులు వాళ్ళు చూపించిన తరువాతే గ్రహించగలుగుతారు. (ఇతరులు గ్రహించనే లేరని గానీ జీవిత అనుభవం నుండి పుట్టిన సిద్ధాంతం తార్కిక విమర్శకూ విషయ నిబద్ధమైన పరిశీలనకూ అతీతం అని గానీ భావించనవసరం లేదు). అందుకే ఉద్యమ నాయకత్వంలోనూ మేధోరంగంలోనూ విభిన్న (ముఖ్యంగా పీడిత) జీవిత అనుభవాల నుండి వచ్చిన వ్యక్తులు ఉండడం అవసరం. అందుకే ఉద్యమ నాయకత్వంలోనూ మేధోరంగం లోనూ కూడా ఎవరు ఉన్నారు అన్న ప్రశ్న వేసుకోవడం-ఏం చేస్తున్నారన్న ప్రశ్నేకాదు - ముఖ్యమైనది, న్యాయమైనది.

వామపక్ష దృక్పథం సిద్ధాంతాన్ని కేవలం తర్కానికి సంబంధించిన విషయంగా భావించిందని కాదు. తర్కంతోబాటు ఆచరణ కూడ ముఖ్యమైనదనే

వామపక్షవాదులు భావించారు. కానీ ఇక్కడ ఆచరణ అనేది కేవలం రాజకీయ ఆచరణ. దానికి ఎంతవారికి పెద్ద పీటవేసినా (తర్కబలంకన్నా, పుస్తక పరిజ్ఞానం కన్నా రాజకీయ ఆచరణే సిద్ధాంత ఆవిష్కరణకు ముఖ్యమన్న అభిప్రాయం కమ్యూనిస్టు సంప్రదాయంలో బలంగా ఉంది. తరచుగా అది పుస్తక పరిజ్ఞానాన్నీ తర్కబద్ధమైన ఆలోచనా రీతినీ తృణీకరించే అతివాద రూపం కూడ తీసుకుంటుంది) అది ఈ ప్రశ్నకు సమాధానం కాదు. ఎందుకంటే రాజకీయ ఆచరణ సిద్ధాంతాన్ని అనుసరించే ఉంటుంది. సిద్ధాంతం చూపించే వెలుగులోనే సాగుతుంది. ఆ వెలుగులో అది సిద్ధాంతాన్ని పరిపుష్టం చేయగలదు గానీ కొత్తదనానికి బాట వేయలేదు. పూర్తిగా సంప్రదాయ విరుద్ధమైన ఆచరణ అయితే తప్ప. సిద్ధాంతంలో కొత్తదనం జీవిత అనుభవం నుండి మాత్రమే రాగలదు. అందువల్ల సిద్ధాంతానికి కొత్తదనం అందివ్వగల జీవిత అనుభవం ఉన్నవారు సిద్ధాంతవేత్తల రంగంలో ఉండాలి. సిద్ధాంతం - ఆచరణ అనే రెండే కాకుండా సిద్ధాంతం - ఆచరణ - జీవిత అనుభవం అనే మూడూ అవసరం. అప్పుడు ఆచరణలో కూడ సిద్ధాంతంలో (అప్పటిదాకా) లేని నవ్యత ఉండగలదు. సిద్ధాంతాన్ని కేవలం రాశిలోనే కాక గుణాత్మకం గానూ పరిపుష్టం చేయగలదు.

కానీ, నాయకత్వ స్థానంలో ఎవరున్నారు అన్న ప్రశ్న దగ్గరే చర్చను ఆపేస్తే ఈ కొత్త ఉద్యమాల నుండి మనం నేర్చుకోగలిగినదంతా నేర్చుకున్నట్టు కాదు. ఇప్పటికి అలవాటయిన వామపక్ష సిద్ధాంత దృక్పథంలోనే కొన్ని సమస్యలున్నాయన్న విషయాన్ని గుర్తించనివాళ్ళం అవుతాం.

ఈ కొత్త ఉద్యమాలలో ఒక్కొక్కటీ సంప్రదాయక అభ్యుదయ రాజకీయ దృక్పథం కళ్ళకు ఎందుకు కనిపించకుండ పోయిందో కొంచెం పరిశీలిద్దాం. నాయకత్వంలో ఉన్నవారి పరిమితులు ఒక కారణం. అయితే సిద్ధాంత దృక్పథంలోనే ఏమైనా లోపాలున్నాయేమో చూద్దాం. సారా వ్యతిరేక మహిళా పోరాటాన్ని మొదట తీసుకుందాం. ఎం.ఎల్.పార్టీలు అంతకు ముందే సారా వ్యతిరేక ఉద్యమాలు నడిపాయి. ప్రభుత్వ ఎక్సైజ్ పాలసీ వికృత రూపం తీసుకోవడం, సారాయి తాగే అలవాటును ప్రభుత్వమే తన రెవిన్యూ అవసరాల కోసం వ్యాపింపచేయడం, సారా కాంట్రాక్టర్ల లాభాలు పెరిగి అదొక పెద్ద రౌడీ వ్యాపారంగా మారడం, వారు రాజకీయాలలో ప్రముఖ స్థానానికి ఎగబాకడం, పేద కార్మికులు మరింతగా సారాయికి బానిసలు కావడం - ఈ క్రమాన్ని మొదట గుర్తించిందీ, దానికి వ్యతిరేకంగా ఉద్యమించినదీ ఎం-ఎల్ పార్టీలు. మొదట సారాయి ధర

తగ్గింపుకోసం ఆందోళన చేసి ప్రజల చేత తిట్లు తిన్నారు. ఆ తరువాత సారా నిషేధం కోసం ఆందోళన చేసారు. అయితే ఈ కృషి మొత్తం, పెట్టుబడిదారీ శ్రమ దోపిడీనీ కార్మిక పోరాటాలనూ కేంద్రం చేసుకున్న కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రాతిపదికన చేసారు. ఆ సిద్ధాంత దృష్టికి, పెరుగుతున్న సారాయి వ్యాపారం కార్మికుల కష్టార్జితాన్ని కాంట్రాక్టర్లూ, ప్రభుత్వమూ కలిసి దోచుకునే దోపిడీ ప్రక్రియగా కనిపించింది. అసలు బాధితులు ఆ కార్మికుల భార్యాబిడ్డలన్న విషయం గమనంలోకి రాలేదు. గమనంలోకి వచ్చినా అది సానుభూతి స్థాయిలోనే తప్ప రాజకీయ స్థాయిలో కాదు. రాజకీయంగా, తన జీతమంతా తాగి వృధా చేసుకుంటున్న కార్మికుడే ఈ సారాయి ప్రహసనంలో ప్రధాన బాధితుడిగా కనిపించాడు. అందువల్లే సారాయి ధర తగ్గించడం కోసం ఆందోళన చేయడం వారికి సాధ్యం అయింది. 'మా భర్తల చేత ఇంకింత తాగించడమా మీ ఉద్దేశ్యం' అని కార్మికుల భార్యలు నిలదీసేదాకా తాము చేస్తున్న తప్పేమిటో ఆ పార్టీలకు అర్థం కాలేదు. కానీ ఆ తరువాత కూడా వాళ్ళు అసలు బాధితులను ఆర్గనైజ్ చేసుకొని ప్రభుత్వంతోపాటు, సారా కాంట్రాక్టర్‌తోపాటు, సంపాదించినదంతా తాగి తమ జీవితాలను నాశనం చేస్తున్న శ్రామిక పురుషులు కూడ ఈ పోరాటంలో వైరి పక్షమేనని ప్రకటించేదాకా అర్థం కాలేదు.

ఆ పార్టీల నాయకులంతా మగవాళ్ళేనన్న విషయం అటుంచి, ఫ్యాక్టరీలో మిషన్లు తిప్పే మగ (అత్యధికంగా) కార్మికులను 'కార్మిక వర్గం' అనే భావనకు కేంద్రం చేసుకుని, ఆ కార్మికులు లోనయ్యే శ్రమదోపిడీని సమాజంలోని ప్రధాన అణచివేత రూపంగా భావించి, ఆ కార్మికుల రాజకీయ చొరవను ఆర్గనైజ్ చేయడం తన ప్రధాన కర్తవ్యంగా పెట్టుకున్న సిద్ధాంతానికి ఈ దృష్టి సహజంగా రాగలిగేదా?

ఏజెన్సీ గిరిజనుల 1 ఆఫ్ 70 పోరాటం మరొక ఉదాహరణ. అది పశ్చిమ గోదావరి జిల్లాలో ముందుకొచ్చిన తరువాత ఒక్క సిపిఐని మినహాయించి తక్కిన అన్ని వామపక్ష శక్తులు ఏదో ఒక మేరకు దానికి మద్దతుగా స్పందించాయి. కానీ చాలా కాలంగా ఆదివాసులలో పునాది ఉన్న ఏ కమ్యూనిస్టు పార్టీ కూడ '1 ఆఫ్ 70' పోరాటాన్ని అదే స్థాయిలో ఎందుకు చేపట్టలేకపోయిందనేది ప్రశ్న. కమ్యూనిస్టు నాయకులలో ఆదివాసీలు లేకపోవడం దీనికొక కారణం అనేది నిజమే కావచ్చు. కానీ సిద్ధాంతం కూడా ప్రతిబంధకంగా పనిచేసిందా? తమ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని ఆదివాసీలు - ఇతరులు అని వర్గీకరించుకొని అడవిభూమి ఆదివాసీలకే చెందాలని

విశ్వసించే దృక్పథానికీ, శ్రామిక రైతాంగాన్ని జాతి, కులం, మతాలకు అతీతంగా ఐక్యపరచి రాజ్యంతో అధికారం కోసం తలపడాలని భావించే దృక్పథానికీ తేడా ఉంటుంది. రెండవ దృక్పథం '1 ఆఫ్ 70' సమస్యను ఒక న్యాయమైన సమస్యగా గుర్తించగలుగుతుంది - కానీ ఒక పరిమితిలోనే. ఆ సమస్య గురించి మరీ ఎక్కువ ఆందోళన చేస్తే అది రైతాంగంలో గిరిజన - గిరిజనేతర విభేదాలను పెంచి అనైక్యతకు దారి తీయగలదు. అందుకు భిన్నంగా రాజ్యం యాజమాన్యంలో ఉన్న అటవీ భూములపైన కమ్యూనిస్టు పార్టీలు - ముఖ్యంగా ఎం-ఎల్ పార్టీలు పెద్ద పోరాటాలు నిర్వహించాయి. వాటి పుణ్యాన ఆదివాసీలు మన రాష్ట్రంలో కనీసం 4 లక్షల ఎకరాల అడవి భూమి అనుభవిస్తున్నారు. కానీ, '1 ఆఫ్ 70' పోరాటం మాత్రం ఆదివాసీలే చేపట్టిన ఉద్యమాలలో ముందుకొచ్చినంత బలంగా ఏ కమ్యూనిస్టు గిరిజన ఉద్యమంలోనూ రాలేదు. రిజర్వ్ ఫారెస్ట్ భూముల కోసం పోరాటం చేసినంత పట్టుదలగా గిరిజనేతరుల ఆక్రమణలో ఉన్న ఆదివాసీ భూములపైన కూడ పోరాటం చేయడం సాధ్యమవుతుందనీ, దానికి తగిన పోరాట రూపాలు ఆవిష్కరించడం సాధ్యమేననీ ఆదివాసీలే నేర్పవలసి వచ్చింది. సామాజిక మార్పును ఏ విధంగా అర్థం చేసుకుంటామన్నది ఇక్కడ కీలకమైన విషయం. విభిన్న సామాజిక జీవిత రంగాలలో ఎక్కడికక్కడ (అంటే సంబంధం లేకుండా అని కాదు) అభ్యుదయకరమైన మార్పు వస్తుందనీ, ఆ మార్పులను సమన్వయపరచి ముందుకు తీసుకుపోవాలనీ భావించడం ఒక దృక్పథం. అందుకు భిన్నంగా, ఒక ప్రధానమైన పరిణామక్రమాన్ని (ఉదాహరణకు కార్మిక వర్గపోరాటాన్ని) మార్పుకు భూమికగా భావించి, దానిని ప్రాతిపదిక చేసుకుని ఇతర రంగాలలో జరిగే మార్పును అర్థం చేసుకోవాలనుకోవడం, సాధించాలనుకోవడం సంప్రదాయక వామపక్ష దృక్పథం. ఈ రెండవ దృక్పథం తాను భూమికగా భావించే పరిణామక్రమాన్ని సాధించడానికి అవసరమైన వ్యూహాలనూ, విశ్లేషణనూ అభివృద్ధి చేయడంలో నిమగ్నం అయి ఉంటుంది. దాని దృష్టి అక్కడే 'ఫోకస్' అయి ఉంటుంది. ఆ పరిణామక్రమానికి ఆటంకం కలిగించే ఆకాంక్షలు - అవి ఎంత న్యాయమైన ఆకాంక్షలయినా - దాని కళ్ళకు సులభంగా కనిపించవు, కనిపించినా దాని ఆమోదం పొందవు. ఇది సిద్ధాంత సంబంధమైన ప్రతిబంధకం. శ్రమ దోపిడీకి గురయ్యే శ్రామికులంతా ఒకటై ఒక బలమైన ఐక్యశక్తిగా పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గాలతోనూ, వారి వర్గ రాజ్యంతోనూ తలపడి తమ రాజ్యాన్ని నెలకొల్పాలన్న వ్యూహానికీ ప్రోగ్రాంకూ ప్రాధాన్యతనిచ్చే వామపక్ష దృక్పథం కళ్ళకు దళిత ఉద్యమం

శ్రామిక ఐక్యతను చీల్చే విచ్ఛిన్నకరవాదంగా కనిపిస్తుంది. స్త్రీలు స్త్రీలుగా అనుభవించే అణచివేత గురించి మాట్లాడడం శ్రామిక వర్గంలో నిలువుగా చీలిక తీసుకొచ్చే వాదనగా కనిపిస్తుంది. అందువల్ల ఆ సిద్ధాంతానికి ఈ సమస్యలు, వాటి పర్యవసానమైన ఆకాంక్షలు - ఆ ప్రజలే వేలెత్తి చూపించేవరకు-కనిపించవు. కనిపించినా వెంటనే ఆదరణ పొందవు. కాలక్రమంలో తొలినాటి ద్వేషభావం తగ్గినప్పటికీ - ఒక మేరకు సంఘీభావం, సమైక్య ఆచరణ పెరిగినప్పటికీ - ఏదో ఒక పరిణామక్రమమే సామాజిక మార్పుకు భూమిక అన్న అభిప్రాయం ఉన్నంతకాలం దానికి అడ్డం వచ్చినట్టు కనిపించే ఇతర పరిణామక్రమాల పట్ల వైరిభావం పోదు. వాటినన్నిటినీ తన నాయకత్వంలో ముందుకు నడిపించడం అటుంచి, వాటితో పూర్తిస్థాయి సంఘీభావం కూడ సాధ్యం కాదు.

దళిత ఉద్యమం ఆవిర్భావంతో కమ్యూనిస్టులు ఎదుర్కొన్న ఈ సమస్యను, ఆ తర్వాత వచ్చినప్పుడు మాదిగ హక్కుల పోరాటం ముందుకు రావడంతో దళిత ఉద్యమం కూడ ఎదుర్కొనింది. ఇక్కడ కూడ దళిత ఉద్యమ నాయకులలో అత్యధికులు ఒక కులానికే (మాల కులానికి) చెందినవారన్నది మాదిగల సమస్యను చూడలేకపోవడానికి ఒక కారణం అని గుర్తించడం ఎంత ముఖ్యమో, దళిత ఉద్యమానికి ఉన్న సిద్ధాంత దృక్పథం నుండి వచ్చిన అవరోధాలను చూడడం కూడా అంతే ముఖ్యం. అఖండమైన, బలమైన దళిత ఐక్యతకు ఈ దృక్పథంలో కేంద్రస్థానం ఉంది. ఒక బలమైన భౌతిక శక్తిగా ఐక్యమైన దళితులు బహుజనకులాలను తమతో కలుపుకొని (కమ్యూనిస్టు సిద్ధాంతంలో ఒక బలమైన భౌతిక శక్తిగా ఐక్యమైన కార్మికులు మధ్యతరగతినీ, రైతాంగాన్నీ తమతో కలుపుకున్నట్టు) అగ్రవర్ణ ఆధిక్యతను సవాలు చేసి దళిత బహుజన సమాజాన్ని (లేక రాజ్యాన్ని) నెలకొల్పాలనే దృక్పథం దళిత రాజకీయాలలో బలంగా ఉంది. ఈ రాజకీయ క్రమం దళిత రాజకీయాల దృష్టిలో పురోగమనానికి ప్రధాన భూమికగా ఉంది. దీనిని 'విచ్ఛిన్నం' చేసే మాదిగల ఆకాంక్ష ఆ సిద్ధాంత దృక్పథానికి సులభంగా కనిపించదు. కనిపించినా వెనువెంటనే ఆదరణ పొందదు. మాదిగల నుండే ఆ ఉద్యమం రావలసి వచ్చింది.

సారాంశంలో, ఏదో ఒక పరిణామక్రమానికి కేంద్రస్థానం ఇచ్చి, దానినే ప్రగతికి భూమికగా భావించే ఏ రాజకీయ దృక్పథమైనా ఇతర పరిణామ క్రమాలకు నాయకత్వం వహించకపోగా (వహించాలని సిద్ధాంతపరంగా భావించినప్పటికీ) వాటిపట్ల అనుమానంతో, సందేహంతో వ్యవహరించటమే జరుగుతుంది. అటువంటప్పుడు

ఆ పరిణామక్రమాలు తమను తాము గుర్తించుకోవలసిందే, తమను తాము ఆవిష్కరించుకోవలసిందే. సమాజంలోని అన్ని సమస్యలకూ మూలమైన భూమిక ఒకటి ఉందనీ, దానిని గుర్తించి ఆ వెలుగులో అన్ని సమస్యల పరిష్కారానికీ బాటవేయగల ఒక పునాది పరిణామక్రమాన్ని ప్రతిపాదించడం, దాని చుట్టూ రాజకీయ వ్యూహాలను రూపొందించడం ప్రగతి కాముకుల కర్తవ్యమని భావించే 'శాస్త్రీయ' దృక్పథాల కళ్ళకు కనిపించని విషయాలు, కనిపించినా ఆదరణ పొందని విషయాలు ఎప్పుడూ ఉంటాయి. అవి అప్రధానమైనవిగా, అశాస్త్రీయమైనవిగా, ఒక్కోసారి రాజకీయ కుట్రలుగా కనిపిస్తాయి. ఈ 'శాస్త్రీయత'ను గుండెకాయగా కలిగి ఉన్న 'ఆధునికత' దృక్పథం మీద 'ఆధునికాంతరవాదం' (పోస్ట్ - మోడర్నిజం) పెట్టే విమర్శ ఈ మేరకు సబబయినదే. సబబయినదనే మనం చర్చిస్తున్న కొత్త ఉద్యమాలతో పాత ఉద్యమాలు, పాత ఉద్యమ సిద్ధాంతాలు ఎదుర్కొన్న సమస్యలు రుజువు చేస్తున్నాయి.

'మూలంలోకి పోయి అంతిమ పరిష్కారానికి బాటవేసే వ్యూహాలను రచించడం' అనే ఈ శాస్త్రీయత అన్ని సమస్యలకూ పరిష్కారం ఇవ్వకపోగా తాను నిర్వచించే బాటలో లేని సమస్యలు మన కళ్ళకు కనిపించకుండ చేస్తుందని గుర్తించిన తరువాత ఒక ఇబ్బంది పెట్టే ప్రశ్న మిగులుతుంది. 'శాస్త్రీయ దృక్పథం' మనకు అన్ని విషయాలూ తెలుపుతుందని అనుకుంటాం. ఒకేసారి అన్నీ తెలిసిపోకపోయినా కాలక్రమంలో తెలుస్తాయని అనుకుంటాం. కానీ 'మూలం' లోకి పోయి 'అంతిమ పరిష్కారాన్ని' ఆవిష్కరించే 'శాస్త్రీయత' స్వభావరీత్యానే అనేక విషయాలు (ఆ మూలానికి చెందనివి) మనకు తెలియకుండ చేస్తుందని గుర్తించడం చాలా ఇబ్బంది పెట్టే విషయం. అప్పుడింక శాస్త్రీయత అనే భావననే వదిలిపెట్టాలా? శాస్త్రీయత అనే భావనే ఒక ఆధిపత్య భావన అనుకోవాలా? పోస్ట్-మోడర్నిస్టులు తరచుగా అదే విధంగా వాదిస్తారు. కానీ అంతటి అతివాదానికి పోవాలా? శాస్త్రీయతకు (సామాజిక విషయాలలో) వేరే అర్థం ఇచ్చుకోలేమా? ఇచ్చుకొని ఆ భావనను రెండు రకాల అతివాదం నుండి కాపాడుకోలేమా? దీనికి జవాబు వెతికే ముందు ఇంకొక రెండు విషయాలు చూద్దాం.

సంప్రదాయక వామపక్ష సిద్ధాంత దృక్పథంలో ప్రజల చైతన్యానికి ముఖ్య స్థానం ఉంది. భౌతిక పరిస్థితులలో రాగల మార్పులను, ఆ మార్పుల వల్ల ప్రయోజనం పొందే ప్రజలు గుర్తించి చైతన్యవంతులయి, దాని సాధనకోసం

పోరాటం చేయాలనీ, చేస్తారనీ ఆ సిద్ధాంతం నమ్ముతుంది. ఇక్కడ 'చైతన్యం' అనే దానిలో ప్రధానమైన విషయం రాజకీయ చైతన్యం. తమ సమస్యలకు మూలమేమిటో గుర్తించడం, శ్రామిక రాజ్యాధికారంలోనే దానికి పరిష్కారం ఉందని గుర్తించడం, ఐక్య శ్రామిక చైతన్యాన్ని పొందడం దీనిలోని ముఖ్య విషయాలు. దానిలో భాగంగా, తమను తాము శ్రామికులుగా గుర్తించుకొని ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోవడం అనే అంశం కూడ ఉంటుంది. ఇప్పుడు కొత్తగా ముందుకొస్తున్న స్త్రీల, ఆదివాసీల, శ్రామిక కులాల ఉద్యమాలు చైతన్యం అనేదానికి వేరే అర్థం ఇస్తున్నాయి. భిన్న జీవిత అనుభవాల ప్రాతిపదికన మాదిగ, చాకలి, వడ్డెర, కోయ తదితర ప్రజానీకం వేదికలు, ఉద్యమాలు ముందుకొచ్చాయి. ఈ ఉద్యమాలిచ్చే చైతన్యం అనిర్దిష్టమైన శ్రామిక చైతన్యం కాదు. నిర్దిష్టంగా ఆ కులానికి చెందిన ప్రజల జీవిత అనుభవం నుండి పుట్టి, సామాజిక సంపదను సృష్టించడంలోనూ సామాజిక జీవితాన్ని సాధ్యం చేయడంలోనూ తాము నిర్వహించిన పాత్రను గుర్తింపచేసే నిర్దిష్టమైన చైతన్యం. ఈ స్వీయజ్ఞానం అనిర్దిష్టమైన శ్రామిక వర్గ చైతన్యం కన్నా లోతయినది, నిండయినది. అది ఇచ్చే ఆత్మవిశ్వాసం బలమైనది. అది చైతన్యం దగ్గర ఆగిపోకుండా కొత్త జ్ఞానాన్ని - వారి నిర్దిష్టమైన జీవిత అనుభవం నుండి పుట్టిన జ్ఞానాన్ని సృష్టించగలదు. ఒక కొత్త రాజకీయ సమీకరణకేకాక, కొత్త మేధావి వర్గం ఆవిర్భావానికి కూడా అది దారి తీయగలదు. అందులో రాజ్యాధికార సాధనకు అవసరమైన రాజకీయ చైతన్యం కంటే ఆయా ప్రజల నిర్దిష్ట జీవిత అనుభవం నుండి పుట్టిన విలువల చైతన్యమే ముఖ్యమైనది కావచ్చు. అయితే దానికి ఉన్న నిర్దిష్టత కారణంగా అది వివిధ శ్రామిక ప్రజల మధ్యన ఐక్యతకు వెంటనే దోహదం చేయకపోవచ్చు. అది ప్రత్యేకతల ప్రాతిపదికన జరుగుతున్న సమీకరణ. దానికి ఐక్యత అసాధ్యం కాదు - అనవసరం ఎంతమాత్రం కాదు - కాని అది 'శ్రమ' అనే అనిర్దిష్టమైన భావన ప్రాతిపదికన జరిగే అఖండమైన భౌతిక ఐక్యత కాదు. అది నిర్దిష్టమైన ప్రత్యేక జీవిత అనుభవాలలోని సామాన్య విలువల ప్రాతిపదికన సాధ్యం కాగల సంఘీభావం, సమైక్య ఆచరణ. అది రాజ్యాధికార సాధనకు ఎంత వరకు ఉపయోగపడుతుందో తెలీదు. కానీ నూతన సమాజపు పునర్నిర్మాణానికి అవసరమైన నిండైన విలువలు ఇవ్వగలదు. ప్రకృతికీ మనిషికీ ఉండవలసిన పరస్పరతా సంబంధాన్ని ఆదివాసీల జీవన విలువల నుండి నేర్చుకోగలం. 'శ్రామికులు' అనే అనిర్దిష్టమైన భావన మనకది నేర్పదు. వ్యక్తిగత సంబంధాలలో

పెత్తనాన్నీ ఆధిపత్యాన్నీ తిరస్కరించడం స్త్రీల జీవిత అనుభవం నుండి నేర్చుకోగలం. 'శ్రామికులు' 'శ్రమదోపిడీ' అనే అనిర్దిష్టమైన భావన నుండి కాదు. ఒక్కొక్క పీడిత ప్రజాసమూహం జీవిత అనుభవం నుండి ఇటువంటి ప్రజాస్వామ్య విలువలు - నిర్దిష్టమైనవి - నేర్చుకోగలము, అవి ఇప్పటికే (ఆ ప్రజల జీవిత అనుభవంలో) ఉనికిలో ఉన్నాయని గుర్తించగలము. వాటి వ్యాప్తికోసం కృషి చేసే సాంస్కృతిక రాజకీయ కృషిని చేపట్టగలం. రాజ్యాధికార సాధన కోసం అవసరమైన శ్రామిక ఐక్యతనూ తత్సంబంధమైన శ్రామిక చైతన్యాన్నీ ప్రధానంగా భావించే సంప్రదాయక వామపక్ష సిద్ధాంత ధోరణి ఈ అవసరాన్ని గుర్తించగలదా? దాని సిద్ధాంత దృక్పథమే అడ్డం రాదా? కొంతమేరకు ఈ నిర్దిష్ట జీవిత అనుభవాల వ్యక్తీకరణను సహించినా, అది శ్రామిక ఐక్యతనూ రాజ్యాధికార సాధనకు అవసరం అయిన ఐక్యబలానికీ అవరోధం అవుతుందన్న భయమే ప్రధానం కాదా?

రాజ్యంపట్ల, రాజ్యసార్వభౌమత్వం పట్ల కూడా ఈ కొత్త ఉద్యమాలు ఒక కొత్త వైఖరిని తీసుకొచ్చాయి. రాజ్యాన్ని మొత్తంగా ప్రజల శత్రువుగా భావించడం, దాని సాధికారతను మొత్తంగా తిరస్కరించడం, రాజ్యంలోని ప్రజాస్వామ్య వ్యవస్థలు, విలువలు బూటకపు సాధికారతను కల్పించే భావజాల సాధనాలు తప్ప వాటి ద్వారా జీవితాలను బాగు చేసుకునే అవకాశంగానీ, అసమానతలను తొలగించుకునే అవకాశంగానీ పీడిత ప్రజలకు లేదని నమ్మడం, అటువంటి అవకాశం ఉందన్న 'అపోహ' ప్రజలలో ఉంటే దానిని తొలగించాలని నమ్మడం సంప్రదాయక వామపక్ష దృక్పథంలో - ముఖ్యంగా ఎం.ఎల్. పార్టీల దృక్పథంలో- ముఖ్యమైన విషయంగా ఉంది. ఈ కొత్త ఉద్యమాలు దీనిని ఆమోదించడం లేదు. తాము అనుభవిస్తున్న ఆధిపత్యానికి రాజ్యం (చట్టం రూపేణా గానీ చట్టబాహ్యమైన ఆచరణ రూపేణా గానీ) వత్తాసుగా నిలిచినప్పుడు మాత్రమే ఈ ఉద్యమాలు రాజ్యాన్ని ప్రశ్నిస్తున్నాయి. నిలదీస్తున్నాయి. అయితే అదే రాజ్యం కల్పించే ప్రజాస్వామిక అవకాశాలను నిజమైన అవకాశాలుగా స్వీకరించి ఆధిపత్యాన్ని ఎదుర్కొనడానికి ఆ అవకాశాలను వాడుకుంటున్నాయి. అవి మొత్తంగా రాజ్యం సాధికారతను తిరస్కరించడం లేదు. విమర్శనాత్మకంగా వ్యవహరిస్తూ ఆ సాధికారతను తమ అవసరాలకు అనుగుణంగా మలచు కుంటున్నాయి.

రాజ్యం సాధికారతను మొత్తంగా తిరస్కరించే వామపక్ష - ప్రత్యేకించి సిపిఐ (ఎంఎల్) - సంప్రదాయం నుండి పుట్టిన పౌరహక్కుల ఉద్యమానికి ఈ కొత్త ఉద్యమాల వైఖరి ఒక సవాలై నిలిచింది. రాజ్యం మొత్తంగా ప్రజల శత్రువే అయితే,

రాజ్యంలోని ప్రజాస్వామ్య వ్యవస్థలు మొత్తంగా బూటకపు సాధికారత కల్పించే సాధనాలయితే, ఆ రాజ్యంలో భాగమైన చట్టసభలలోనూ, న్యాయవ్యవస్థలోనూ, బ్యూరోక్రసీలోనూ తమకు ప్రవేశం కావాలని కోరుకుంటున్న దళితుల కోరికనూ, స్త్రీల కోరికనూ ఏ విధంగా అర్థం చేసుకోవాలి? ఆ రాజ్యంలో భాగంగానే ప్రత్యేక రాష్ట్రం కావాలన్న తెలంగాణ ఉద్యమకారుల కోరికనూ, ఏజెన్సీ ప్రాంతాలకు స్వయంపాలనా అధికారం కావాలన్న ఆదివాసీ ఉద్యమం కోరికనూ ఏ విధంగా అర్థం చేసుకోవాలి? పాలక వర్గంలో చేరిపోవాలని ఆరాటపడుతున్న 'క్రీమీ లేయర్' ప్రయత్నంగా చూడాలా? లేక రాజ్యం కల్పించే ప్రజాస్వామిక అవకాశాలను వాడుకొని, వాటిని మరింత ప్రజాస్వామికంగా మలచుకొని, తద్వారా సాంఘిక జీవితంలోని అసమానతలనూ ఆధిపత్యాన్నీ ఎదుర్కొనే ఒక న్యాయమైన ప్రయత్నంగా చూడాలా? ఈ చర్చ ఈ రోజు పౌరహక్కుల ఉద్యమంలో జరుగుతూ ఉంది.

నిజానికి పౌరహక్కుల ఉద్యమమే - తన ఆచరణ నుండి సరయిన జ్ఞానాన్ని పెంపొందించి ఉంటే - సంప్రదాయక వామపక్షానికి రాజ్యాన్ని గురించి, ప్రజా స్వామ్యాన్ని గురించి ఉన్న అవగాహనను ప్రశ్నించే 'కొత్త ఉద్యమం' అయి ఉండాలి. రాజ్యానికి-సంప్రదాయక వామపక్ష అవగాహనలో-సాధికారత కల్పించే సాధనాలలో చట్టబద్ధ పాలన, పౌరహక్కులు, న్యాయవ్యవస్థ, స్వతంత్ర ప్రతిపత్తి ముఖ్యమైనవి. మరి వీటి కోసమే ఆందోళన చేసే పౌరహక్కుల ఉద్యమం ఏం చేస్తూ ఉంది? బూటకపు సాధికారతను పెంపొందిస్తూ ఉందా? లేదనుకుంటే, ఆ సాధికారత పూర్తిగా బూటకం కాదనీ, కేవలం భావజాలం కాదనీ, అందులో కొంత సత్యం ఉందనీ పౌరహక్కుల ఉద్యమం చెప్పవలసి ఉంటుంది. పౌరహక్కుల ఉద్యమం ఈ తాత్విక మీమాంసలో కొట్టుమిట్టాడుతున్న సమయంలోనే ఈ కొత్త ఉద్యమాలు దానిని మరింత పెంచాయి. కేవలం చట్టాలు, న్యాయవ్యవస్థే కాక చట్టసభలు, పరిపాలనా వ్యవస్థలు కూడా ప్రజాస్వామ్య ప్రయోజనాలకు పూర్తిగా పనికి రానివేం కావనీ, వాటిని ఉపయోగించుకోవడం, సంస్కరించుకోవడం పూర్తిగా అసాధ్యమేమీ కాదనీ ఈ ఉద్యమాలు తమ ఆచరణ ద్వారా ప్రకటిస్తున్నాయి. రాజ్యాన్ని బద్దలు కొట్టి ప్రత్యామ్నాయ (శ్రామిక) రాజ్యాన్ని నెలకొల్పడం అనే కీలకమైన లక్ష్యాన్ని తన ముందుంచుకొని దానికి అనుగుణ్యమైన బలసమీకరణపైన దృష్టి పెట్టే కమ్యూనిస్టు ఉద్యమానికి ఇది సిద్ధాంతపరమైన సవాలే. ఈ ఉద్యమాలతో దానికి సులభంగా

సయోధ్య కుదరక పోవడానికీ, తరచుగా అసహనంగా వ్యవహరించడానికీ ఇదీ ఒక కారణమే. అంతకంటే ముఖ్యంగా, ఆధునిక రాజ్యం మొత్తంగా అన్ని రకాల ప్రజాప్రయోజనాలకూ అన్ని రకాల ప్రగతికీ శత్రువు కాదనీ, రాజ్యం ద్వారా సాధించుకోగల ప్రగతి కూడ ఉండగలదనీ, రాజ్యం సార్వభౌమత్వాన్ని ఎల్లవేళలా సవాలు చేయవలసిన అవసరం ప్రజలందరికీ లేదనీ ఈ కొత్త ఉద్యమాలు నేర్పుతున్న విషయాన్ని సంప్రదాయక కమ్యూనిస్టు సిద్ధాంతం తన అవగాహనలో ఇముడ్చుకోవడం కష్టమే.

చివరిగా, ఈ కొత్త ఉద్యమాల నుండి వచ్చిన ఆలోచనల నేపథ్యంలో సామాజిక మార్పును ఏ విధంగా సిద్ధాంతీకరించగలుగుతాం? సంప్రదాయక వామపక్ష దృక్పథానికి ఇవి ఎటువంటి ప్రత్యామ్నాయాన్ని ముందుపెడుతున్నాయని భావించగలుగుతాం? సమాజాన్నీ ప్రపంచాన్నీ మొత్తంగా విశ్లేషించి, మొత్తంగా మార్చడానికి అవసరమైన ఆచరణక్రమాన్ని మొత్తమందరికీ ఒకేసారి ఇవ్వగల సిద్ధాంతం ఉండజాలదని భావించవలసి ఉంటుంది. అటువంటి సిద్ధాంతం తాను ఎంత శాస్త్రీయంగా విశ్లేషిస్తున్నానని భావిస్తుందో అంతగా మన దృష్టినుండి అనేక విషయాలను మరుగుపరుస్తుందనీ, ఎంత సమగ్రంగా మార్పుకు బాట వేస్తున్నానని నమ్ముతుందో అంతగా మార్పుకు సంబంధించిన ఇతర అవకాశాలను మరుగు పరుస్తుందనీ, ప్రత్యామ్నాయాన్ని గురించి ఎంత లోతుగా ఆలోచిస్తున్నానని భావిస్తుందో అంతగా ప్రత్యామ్నాయానికి కావలసిన జీవిత విలువల ఎదుగుదలను విస్మరిస్తుందనీ పైన వివరించాము. సామాజిక పరిణామ క్రమం బహుముఖం, బహుళం అనే ప్రాథమిక సత్యాన్ని గుర్తించవలసి ఉంది.

అయితే ప్రపంచాన్ని 'మొత్తం'గా వివరించేయడంలో గల ఇబ్బందులను గుర్తించాము కాబట్టి ఈ ప్రపంచం ఒక 'మొత్తం' అనే భావననే వదిలిపెట్టాలా? దాని బహుముఖత్వాన్ని గుర్తించినంతమాత్రాన ఆ బహుముఖాల మధ్యనున్న పరస్పర సంబంధాలను విస్మరించాలా? అన్నిటినీ ఒక్కసారిగా వివరింపజూసే 'శాస్త్రీయత'ను సందేహించవలసిన అవసరం ఉందని గుర్తించామని చెప్పి అసలు శాస్త్రీయత అనే భావననే సందేహించాలా? నిర్దిష్టతనూ వైవిధ్యాన్నీ అర్థం చేసుకోవలసిన ఆవశ్యకతను అంగీకరించినంతమాత్రాన అసలు సార్వజనీనత, విశ్వజనీనత అనేవే లేవనుకోవాలా? పోస్ట్ - మోడరన్ (ఆధునికానంతరవాద) తాత్విక ధోరణి అవుననే అంటుంది. అయితే మన ముందు ఉన్న కొత్త ఉద్యమాలు మనకిస్తున్న సమాధానం ఇది కాదని నేను భావిస్తున్నాను.

బహుముఖమైన ప్రాపంచిక వాస్తవికత పరస్పర సంబంధాలున్న ఒక మొత్తం. దానిని మొత్తంగా వివరించి ఒక పరిణామ క్రమాన్ని ప్రతిపాదించే విశ్లేషణా సూత్రాలేవీ లేకపోవచ్చుగానీ దానిలో ఏ అంశాన్ని విశ్లేషించేటప్పుడయినా మిగిలిన వాటితో ఉన్న సంబంధాన్ని దృష్టిలో పెట్టుకోవడం అవసరం. పరస్పర ప్రభావాలను దృష్టిలో పెట్టుకోవడం అవసరం. ఆయా రంగాలలో నడుస్తున్న ఉద్యమాలకు కూడ ఇది వర్తిస్తుంది. వాటిలో ఏ ఒక్కటీ ప్రాధాన్యతా క్రమంలో మిగిలిన వాటికంటే ముఖ్యమైనది కాకపోవచ్చు. కానీ అవన్నీ అంతమాత్రం చేత పరస్పర సంబంధం లేని ద్వీపాలు కావు.

ఈ భౌతిక సంబంధమే కాక ఉద్యమాల మధ్య విలువల సారూప్యత కూడా బలంగా ఉంటుంది. ఉద్యమాల మధ్య సంఘీభావానికీ, సమైక్యఆచరణకూ, వైరుధ్యాల పరిష్కారానికీ ఈ విలువల సార్వజనీనత అవకాశాన్ని కల్పిస్తుంది. విభిన్నమైన జీవిత అనుభవాల నుండి పుట్టి విభిన్నమైన అణచివేత రూపాలను ప్రశ్నించే ఉద్యమాలన్నీ తమ ఆకాంక్షలను ఒకే రకమైన విలువల ద్వారా వ్యక్తం చేస్తాయి. సమానత్వం ఇందులో కీలకమైనది. అది సమాన ప్రతిపత్తి రూపంలో ఉండవచ్చు, సమాన గౌరవం రూపంలో ఉండవచ్చు, సమాన అవకాశాల రూపంలో ఉండవచ్చు. నిర్దిష్టంగా అది అనేక రూపాలు తీసుకోవచ్చు. కానీ సమానత్వం అనే సాధారణ విలువ ఈ ఆకాంక్షల మధ్య నైతిక సారూప్యతను తీసుకొస్తుంది. ఏదో ఒక పునాది పరిణామక్రమం సామాజిక మార్పుకు సార్వజనీనతను అందిస్తుందన్న సంప్రదాయక కమ్యూనిస్టు దృక్పథాన్ని తిరస్కరించి నంతమాత్రాన ఇంక మిగిలింది ఎక్కడికక్కడ విడివిడిగా జరిగే మార్పేనని అనుకోనవసరం లేదు. ఆ విడివిడి ప్రయత్నాల మధ్య (అవి ఎదుర్కునే సమస్యల మధ్య) ఉండే భౌతిక సంబంధం వాటిని ఒక రకంగా కలిపితే, విలువల సారూప్యత వాటిని స్థూలంగా ఒక దిక్కుగా నడిపిస్తుంది. వాటి మధ్య సంఘీభావాన్ని పెంపొందిస్తుంది. సంఘీభావం లోపించినా, వైరుధ్యాలు ముందుకొచ్చినా పరిష్కరించడానికీ, ఆ లోపాన్ని సవరించడానికీ అవసరమైన తాత్విక ప్రాతిపదిక కల్పిస్తుంది.

'చూపు' మాసపత్రిక

జనవరి - ఫిబ్రవరి 1999

(చివరి నాలుగు పేరాలు 'చూపు'లో అచ్చుకాలేదు. ఇటీవలే రాతప్రతి దొరికినందువల్ల 'మనిషి మార్క్సిజం' పునర్ముద్రణలో దానిని చేర్చాము, గమనించగలరు.)

V

# ‘జనచైనా’ స్వర్ణ ప్రస్థానం



ఆస్తి సంబంధాలను సమూలంగా మార్చి, తద్వారా సమాజాన్ని సమూలంగా మార్చాలన్న లక్ష్యంతో కమ్యూనిస్టు పార్టీలు రాజ్యాధికారాన్ని చేజిక్కించుకున్న ‘విప్లవాల’న్నిటిలోకి అత్యధికంగా ప్రజల మద్దతు ఉన్న ప్రయత్నంగా ‘చైనా విప్లవం’ పేరు పొందింది.

50 సంవత్సరాల తర్వాత ఆ విప్లవంలో ఏకపార్టీ నియంతృత్వం తప్ప వేరే ఏమీ మిగలలేదు. వేరే ఏ ప్రయోజనమూ రాలేదని కాదు. అట్టడుగు ప్రజానీకానికి తిండి, చదువు, ఆరోగ్యం కల్పించి అభివృద్ధి ఫలాలను అందుకోవడానికి కావలసిన బలాన్ని కొంత ఇవ్వగలిగింది చైనా. ఇందులో సగం కూడ సాధించని మనం చైనాను ఈసడించు కోనవసరం లేదు. కానీ మానవ జీవితాన్ని సమూలంగా మార్చాలన్న చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రయత్నం మనకు ఏమైనా మిగిలించిందా అంటే ఆ పని ఏ విధంగా చేయాలన్న దానికంటే ఏ విధంగా చేయకూడదన్న జ్ఞానాన్ని మిగిలించిందని చెప్పుకోవలసి ఉంటుందేమో.

సమష్టి శ్రమకు, సమష్టి జీవన విధానానికీ నిదర్శనంగా నిలిచే ప్రయోగాలనేకం చైనాలో జరిగాయని భావించడం కద్దు. ఒక దశలో చైనా కమ్యూన్ల అనుభవాల గురించి చాలా ప్రచురణలు వచ్చాయి. మనబోటి దేశాలలో చాలామందికి చాలా ఉత్తేజం ఇచ్చాయి. కానీ ఇప్పుడు ఆలోచిస్తే ఆ పుస్తకాల రచయితలంతా తాము ఏమి

చూడదలుచు కున్నారో అదే చూసారేమోనని అనిపించకమానదు. ఈ పుస్తకాల రచయితలంతా పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ కల్పించిన జీవితం పట్ల విముఖత పెంచుకొని ప్రత్యామ్నాయం ఏ కొంచెం కనిపించినా దానిని విశ్వసించడానికి సిద్ధంగా ఉన్న పాశ్చాత్యులే తప్ప ఒక్కరూ చైనీయులు కారు. నిజానికి రష్యాలో స్టాలిన్ నియంతృత్వం అత్యంత తీవ్రంగా ఉన్న తరుణంలో సహితం ఆ దేశం నుండి బయటికొచ్చయినా సరే అక్కడి జీవితాన్ని గురించి రాసిన రష్యన్లు ఉన్నారు గానీ, చైనా గురించి చైనీయులు రాసిన పుస్తకాలు (అధికార కమ్యూనిస్టు ప్రచురణలు తప్ప) దాదాపు మృగ్యమనే చెప్పాలి. పైగా, చైనా విప్లవం పట్ల చాలా సానుభూతి గల పరిశీలకులు సహితం, ఆ దేశంలో ఏ దశలోనయినా ప్రభుత్వం ఏం చెప్తుందో ప్రజలంతా అదే చెప్తారు తప్ప భిన్నస్వరాలు వినిపించవని అంటారు.

అందువల్ల 'చైనా విప్లవం' అనే దానిలో నిజంగా ఏం జరిగిందో మనకు స్పష్టంగా తెలుసుననుకోను. తెలిసిన మేరకు సోషలిజం కోసం అనుసరించవలసిన విషయాల కంటె అనుసరించకూడనివే ఎక్కువ ఉన్నాయేమో.

దైనందిన జీవితక్రమంలో తనను తాను ఏ రోజుకారోజు పునస్సృష్టి చేసుకునే దానినే 'వ్యవస్థ' అనగలం. ఆ అర్థంలో ఒక్క చైనాలోనే కాదు, రష్యాతో సహా ఏ దేశంలోనూ ఇప్పటిదాకా సోషలిస్టు వ్యవస్థ అనేది తాత్కాలికంగా కూడ ఏర్పడలేదు. సోషలిజానికి సంబంధించిన ప్రయోగాలు మాత్రమే ఈ దేశాలన్నిటిలోనూ జరిగాయి. రాజ్యాధికార బలంతో నిలిచేది 'వ్యవస్థ' కాదు. ఇంకొకరకంగా చెప్పాలంటే పౌరసమాజంలో భాగమయినదే ఒక సామాజిక వ్యవస్థ అనిపించుకుంటుంది. రాజ్యాన్ని ఆలంబన చేసుకొని బతికే దానికి ఆ పేరు పెట్టలేము. ఇప్పటిదాకా సోషలిజం అనేది రాజ్యాన్ని ఆలంబన చేసుకొని బతికింది. రాజకీయం అగ్రభాగాన ఉండాలనీ, అది రాజ్యాధికారం రూపంలో ఉండాలనీ నమ్మే మావోయిజం దృష్టికి ఇదొక బలహీనతగా కనిపించకపోవచ్చును గానీ ఇది నిజానికి తీవ్రమైన బలహీనత.

పోనీ ఆ రాజ్యాధికారం ప్రజాస్వామ్య రూపంలో ఉండి ఉంటే ఆ మేరకైనా సోషలిజం పౌరసమాజంలో భాగమయిందని అనగలుగుదుమేమో. కానీ చైనా రాజ్యం ప్రజాస్వామ్యానికి చాలా దూరం. కమ్యూనిజానికి సంబంధించిన ప్రయోగాలలో చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రజలకు చాలా భాగస్వామ్యం కల్పించినట్టు చెప్పుకునే ఉదంతాలు అనేకం ఉన్నాయి. అది నిజమేననుకున్నా, ఆ పార్టీతో విభేదించే

స్వేచ్ఛ మాత్రం ప్రజలకు లేదు. ఆ పార్టీ విధానాలపట్ల ఆమోద అనామోదాలు తెలిపే స్వేచ్ఛ లేదు.

ప్రజాస్వామ్యం పాశ్చాత్యదేశాల నమూనాలోనే ఉండాలా అని ప్రశ్నిస్తారేమో. ఉండనక్కరలేదు. కానీ ఏదో ఒక నమూనాలోనయితే ఉండాలి. ప్రజలకు విభేదించడానికీ తిరస్కరించడానికీ అవకాశం లేని ఏకపార్టీ నమూనా కలదే ప్రజాస్వామ్యం అనలేము. దిగజారిన పార్టీని తిరస్కరించమనీ, అధిష్ఠానాన్ని బద్దలు కొట్టమనీ మావో పిలుపు ఇచ్చాడు గానీ అది చైనా రాజ్యాంగం కల్పించిన హక్కు కాదు. రాజ్యాంగంలోనే అటువంటి హక్కు కల్పించే ప్రయత్నమేదీ మావో చేయలేదు. పార్టీ గాడి తప్పిందనుకున్నప్పుడు ఆయన ఒక రాజకీయ కార్యక్రమంగా ప్రజలకిచ్చిన పిలుపు అది.

మావో గట్టిగా నమ్మిన కమ్యూనిస్టు ఆదర్శానికే చైనా కమ్యూనిస్టు పార్టీ దూరమయిన తరువాత జరిగిన తియానన్‌మెన్ స్క్వేర్ ఊచకోత గురించి విన్నాము. ఈ మధ్యనే టిబెట్‌లో అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటనను స్థానిక భాషలోనికి అనువదించి కరపత్రంగా అచ్చువేసి పంచుతున్న ఒక మానవహక్కుల కార్యకర్తకు చైనా న్యాయవ్యవస్థ 18 సంవత్సరాల జైలు శిక్ష విధించింది. అతనొక్కడే కాదు, చైనా రాజ్యాంగం పౌరులకు సాధారణ పౌర రాజకీయహక్కులు కల్పించాలని డిమాండ్ చేసిన మానవహక్కుల కార్యకర్తలందరూ జైలులో ఉన్నారు. ఈ వికారం మావో చనిపోయిన తరువాత పుట్టినది కాదు. మొదటి నుండి ఉన్నదే. టిబెట్ ప్రజలపైన అణచివేత కూడ మొదటి నుండి ఉన్నదే.

సమసమాజాన్ని మించిన సామాజిక రాజకీయ ఆదర్శమేదీ ఉండజాలదు. అయితే దానిని ఏ విధంగా సాధించాలన్న ప్రశ్నకు ఈ రోజు స్పష్టమైన జవాబేదీ లేదు. ఒక శాస్త్రీయమైన జవాబు ఉందన్న విశ్వాసంతో ప్రారంభమైన ఇరవయ్యవ శతాబ్దం ఆ జవాబును ఆచరణలో పెట్టడానికి జరిగిన మహత్తరమైన ప్రయత్నాలను చూసింది. కానీ చివరికి సందేహంతోనే ముగుస్తున్నది.

'చైనా విప్లవం' అందులో భాగమే. రష్యా విప్లవం మిగిలించిన సందేహాలకు సాంస్కృతిక విప్లవం అనే సమాధానాన్ని చైనా - అందులోనూ మావో ఆలోచనా సరళి - ఇచ్చిందని నమ్మేవారున్నారు. సాంస్కృతిక విప్లవం అనే భావనను కొంచెం సేపు పక్కనపెట్టి చైనాలో వాస్తవంగా నడిచిన సాంస్కృతిక విప్లవాన్ని పరిశీలిస్తే, మనకు ఏ సమాధానమూ కనిపించదు. రాజ్యం తన కర్రపెత్తనం ద్వారా మనుషులనూ మానవ సంబంధాలనూ మార్చాలని ప్రయత్నించడం రష్యా విప్లవం

ఎదుర్కొన్న సమస్యలకు మూల కారణమైతే, చైనా సాంస్కృతిక విప్లవం ఆ కర్రపెత్తనాన్ని రాజ్యం చేతినుండి మిలిటెంట్ల చేతిలో (రెడ్ గార్డ్స్ చేతిలో) పెట్టింది. బలప్రయోగం పైన విశ్వాసం రెండు నమూనాలలోనూ ఉన్న సామాన్య లక్షణం. కానీ బల ప్రయోగానికి మానవ సామాజిక ప్రగతిలో ఉండగల పాత్ర స్వల్పమే. పాతవ్యవస్థను ధ్వంసం చేయడంలో కొంత ఉండవచ్చు (అది కూడా మామూలుగా ఊహించుకునేంత కాదు). కానీ నూతన పరిస్థితుల రూపకల్పనలో బల ప్రయోగానికీ నిర్బంధానికీ ఉండగల పాత్ర చాలా చాలా స్వల్పం. 'సాంస్కృతిక విప్లవం' అనేది సంస్కృతిలోనూ సామాజిక సంబంధాలలోనూ మార్పు తీసుకొచ్చే ప్రయత్న మయినట్టయితే ఆ క్రియకూ చైనాలో ఆ పేరు మీద నడచిన పోరాటానికీ పొంతన ఏమీ లేదు.

ఇది 'సాంస్కృతిక విప్లవం' ఎవరో కొందరు అతివాదుల చేతిలోకి పోవడం వల్ల, లేదా కొన్ని అతివాద పొరబాట్లు జరగడం వల్ల వచ్చిన సమస్య కాదు. పాతను వ్యతిరేకించే క్రమంలో జరిగే పోరాటానికీ, కొత్తను నిర్మించడం కోసం జరిగే కృషికీ మధ్య చాలా తేడా ఉంటుందని గుర్తించకుండ రెండింటినీ ఒకే అవిచ్ఛిన్నక్రమంలో దశలుగా లేక ఒకే క్రమానికి పార్శ్వాలుగా చూడడంలోనే లోపం ఉంది. మొదటి దానికి అనుసరించే పద్ధతులే రెండవ కృషికి కూడ తగినవనే ఆలోచనలోనే ఉంది. అసమాన సామాజిక వ్యవస్థను అధిగమించడానికి వర్గపోరాటమే సరయిన మార్గమని అనుకున్నా, సాంస్కృతిక విప్లవం అనే భావన ఏ లక్ష్యాలనయితే తన ముందు పెట్టుకుందో ఆ లక్ష్యాలు కూడ వర్గపోరాటం ద్వారానే సిద్ధిస్తాయన్న మావో ఆలోచనే లోపభూయిష్టమైనది.

అయితే ఈ లోపం కేవలం మావోది కాదు. పోరాటం - పునర్నిర్మాణం అనే క్రియలు స్వాభావికంగానే చాలా భిన్నమైన నైజం గల ప్రక్రియలన్న అవగాహన మార్క్సతో సహా మార్క్సిస్టు సంప్రదాయంలో ఏ ఒక్కరిలోనూ కనిపించదు.

ఈ రోజు పెట్టుబడిదారీ వ్యవస్థను ఎందుకు వ్యతిరేకించాలన్నది ప్రశ్న కాదు. గుత్తపెట్టుబడిదారీ కార్పొరేషన్ల గుప్పిట్లో ఉన్న సమకాలీన పెట్టుబడిదారీ వ్యవస్థ చాలా మందికి చాలా ఆశలు చూపించే మాట వాస్తవమే అయినా, అది తన వికృత స్వభావాన్ని దాచిపెట్టలేదు. అది ఎంత వికృతంగా ఉన్నా దానివల్ల వచ్చే ప్రయోజనాల కోసం దానిని ఆదరించే వాళ్లుంటారు గానీ అదొక అందమైన సమాజం అని దబాయించే వాళ్లెవరూ ఈ రోజు లేరు.

కానీ దానిని (పెట్టుబడిదారీ వ్యవస్థను) ఏ విధంగా అధిగమించాలన్న ప్రశ్నకు ఈ శతాబ్దంలో జరిగిన కమ్యూనిస్టు ప్రయోగాలు కచ్చితమైన జవాబు ఇవ్వలేక పోయాయి. కార్మిక వర్గం తన పోరాటాల ద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థను కూలదోస్తుందని నమ్మే పరిస్థితి పోయింది. ఒక వర్గానికే పరిమితం కాని విశాలమైన కృషి అవసరం అని సోషలిస్టు పోరాటాల అనుభవం నుండి అర్థం అవుతున్నది.

అంతకంటె ముఖ్యంగా, మనుషులు శ్రమనూ సంపదనూ బాధ్యతలనూ సమష్టిగా పంచుకునే సమాజాన్ని ఏ విధంగా నిర్మించగలమన్న ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. చైనాలో మావో చేపట్టిన 'సాంస్కృతిక విప్లవం' అనే రాజకీయ భావనలో ఈ ప్రశ్నకు జవాబు ఉందని పదే పదే అనడం వినడం జరుగుతున్నది గానీ దానిని ఆమోదించడానికి అవసరమైన సైద్ధాంతిక విశ్లేషణ గానీ చారిత్రక వివరణ గానీ లేవు.

అటువంటి విశ్లేషన గానీ వివరణ గానీ ఇవ్వాలంటే సంస్కృతి గురించీ సంస్కృతికీ మానవ వ్యక్తిత్వానికీ మధ్యనున్న సంక్లిష్టమైన సంబంధాన్నీ గురించీ అవగాహన ఉండాలి. వామపక్షవాదులలో సాంస్కృతిక రంగమే తమ కార్యరంగం అని చెప్పుకునే వారికి సహితం ఈ అవగాహన లేదు. అవేమీ లేకుండ సాంస్కృతిక విప్లవాన్ని కమ్యూనిస్టు ప్రయోగంలోని శేషప్రశ్నలకు జవాబుగా ప్రచారం చేయడం, చైనా దానికి ఒక నిదర్శనమని చెప్పుకోవడం ఆనవాయితీ అయిపోయింది. 'చైనా విప్లవం' ఆరంభమైన 50 ఏళ్ల సందర్భంగా ఈ మాటలే మరొక్కసారి వినబోతాము గానీ మన అవగాహన దానివల్ల ఆవగింజంత కూడ మెరుగుపడబోదు.

'వార్త' ఆదివారం అనుబంధం
3 అక్టోబరు 1999

V

# పోస్ట్ మోడర్నిజం-వామపక్ష చైతన్యం



పోస్ట్ మోడర్నిజం (ఆధునికానంతర వాదం) అనే పేరులోనే అనవసరమైన ఆడంబరం ఉంది. ఆ ఆలోచనా రీతి ఆధునికానికి 'అనంతరం' అయితే దానికి అనంతరం ఏమిటి? దానికి అనంతరమేదీ ఉండదా? అదే చరిత్రలో ఆఖరి తాత్వికవైఖరా?

పేరులోనే కాదు, పరిభాషలోనూ పోస్ట్ - మోడర్నిజంలో చాలా ఆడంబరంగ ఉంటుంది. దానివల్ల ఆధునికానంతరవాదుల రచనలు చదవడం, అర్థం చేసుకోవడం కష్టం.

పదజాలంలో ఉన్న అనవసరమైన ఆర్భాటం వల్ల పోస్ట్ - మోడర్నిజం పట్ల సులభంగా వ్యతిరేకత ఏర్పడే ప్రమాదం ఉంది. ఆ కారణంగా ఆధునికానంతర వాద ఆలోచనా రీతిని వ్యతిరేకించే వాళ్లు చాలామంది ఉన్నారు. అది కొంతవరకు సహజమే కావచ్చు. (పైగా ఆధునికానంతర వాదుల స్వయంకృతం కూడ). కానీ ఆ రకమైన వ్యతిరేకత నష్టకరం.

ఎందుకంటే వారి ఆలోచనలలో విలువైనవి, ఉపయోగ కరమైనవి కొన్ని ఉన్నాయి. ప్రధానంగా, 'ఆధునికత' అని దేనినయితే వారు అంటారో ఆ ఆలోచనారీతిలోని స్వాతిశయంపైన, తాత్విక అహంభావంపైన వారు పెట్టే విమర్శ చాలా విలువైనది. ఆధునికుల మని మనల్ని మనం భావించుకునే వాళ్లకు ఈ విమర్శ నేర్పించగల

తాత్విక వినమ్రత చాలా మేలు చేస్తుంది. (ఆధునికానంతర వాదులలో ఆ వినయం ఏ కోశానా కనిపించదనేది వేరే సంగతి)

'శాస్త్రీయత' ఆధునికతకు సంబంధించిన అత్యంత కీలకమైన భావన. అది బూర్జువా దృక్పథానికి ఎంత ప్రియమైన భావనో, కమ్యూనిస్టులకు కూడ అంత ప్రియమైనది. ఈ రెండు రకాల శాస్త్రీయతలో ఒకదానిని ఎంచుకోవాలన్న ఒత్తిడి ఈ శతాబ్ద రాజకీయాలను శాసించింది. రెండింటినీ విమర్శించే వారు లేకపోలేదు గానీ వారు సనాతనవాదులుగా గుర్తించబడ్డారు. కాబట్టి శాస్త్రీయతపైన వారు పెట్టే విమర్శకు పెద్దగా విలువ లేకుండా పోయింది. కాని ఈ రెండు రాజకీయ ధోరణులకు సామాన్య తాత్విక భూమిక ఉందని గుర్తించి, దానికి 'ఆధునికత' అని పేరు పెట్టి దానిని తీవ్ర విమర్శకు గురిచేసిన ఆధునికానంతర వాదాన్ని ఆ అర్థంలో సనాతన దృక్పథం అని కొట్టిపారేయడం సాధ్యం కాకపోవడం వల్ల, ఆ విమర్శకు జవాబు చెప్పడం ఆధునికతకు తప్పనిసరి అయింది.

ఆ విమర్శలో చాలా వాస్తవం ఉందని ఆధునికవాదులు గుర్తించడం అవసరం. ఆ విమర్శను మించి ఆధునికానంతర వాదంలో వేరే ఏమీ లేదని ఆధునికానంతర వాదులు గుర్తించడమూ అవసరమే. ఎందుకంటే పోస్ట్ - మోడర్నిజాన్నే ఒక ప్రాపంచిక దృక్పథంగా భావించే పోకడ ఒకటి బయలుదేరింది. ప్రాపంచిక దృక్పథానికి అవసరమైన పాజిటివ్ లక్షణాలు అందులో ఉండి ఉంటే అందుకు అభ్యంతరం చెప్పనవసరం లేదు. కాని జ్ఞాన సిద్ధాంత విమర్శకు ఉపయోగపడే తాత్విక పరికరాలనే ఒక ప్రాపంచిక దృక్పథంగా భావించడం సబబు కాదు.

విశ్వాసాలలో గాఢత, తీవ్రత ఎప్పుడూ ఉండేవే. మత విశ్వాసాలు బలంగా కలవాళ్లు తమ దగ్గరే సత్యం ఉందని, ఇతరులు చీకటిలో ఉన్నారని నమ్ముతారు. ఇది చాలా క్రూరమైన అసహనానికి దారి తీయగలదని మనకందరికీ తెలుసు. కానీ 'శాస్త్రీయ దృక్పథాల'లోనూ అంతే అసహనం ఉన్నప్పటికీ అది 'శాస్త్రీయం' కాబట్టి దానిని అసహనంగా గుర్తించడం కష్టం.

ఈ అసహనం నిజానికి మత అసహనం కంటే ఎక్కువేమో. ఎందుకంటే ఇతర ఆలోచనా రీతులు ఎందుకు తప్పో వివరించగల విశ్లేషణా పరికరాలు తన దగ్గరున్నాయని శాస్త్రీయత నమ్ముతుంది. శాస్త్రీయత తనను తాను ఒకానొక

దృక్పథంగా భావించదు. అన్ని దృక్పథాలలోని సత్యాసత్యాలను తూకం వేయగల మహా దృక్పథంగా భావించుకుంటుంది. అది కూడ ఒక దృక్పథమేనని చెప్పడం ఆధునికానంతర వాదం చేసే మేలు. మరయితే సత్యాసత్యాల తూకం అసలే సాధ్యం కాదా అనే ప్రశ్నకు జవాబు చెప్పగల తాత్విక పరికరాలు లేకపోవడం ఆధునికానంతర వాద బలహీనత.

'నీది తప్పు, నాది ఒప్పు' అని ప్రతి విశ్వాసమూ అంటుంది. కానీ, 'నీది ఎందుకు తప్పో వివరించగల తప్పొప్పుల ప్రమాణాన్ని నేను' అని సైన్స్ మాత్రమే అంటుంది. హిందువులు ముస్లింలను మూర్ఖులు అంటారు. ముస్లింలు హిందువులను మూర్ఖులు అంటారు. కానీ వీరి మూర్ఖత్వాన్ని వారు వివరించబూనుకోరు. వారి మూర్ఖత్వాన్ని వీరు వివరించబూనుకోరు. (శాపగ్రస్తులనో, సైతాన్ ప్రభావంలో ఉన్నారనో అనుకోవడం తప్ప). కానీ సైన్స్ వీరిద్దరితోన విభేదించడం మాత్రమే కాదు, వీరిద్దరి మూర్ఖత్వాన్ని తాను వివరించగలనని నమ్ముతుంది. అవి రెండూ విశ్వాసాలు కాగా తాను విశ్వాసాలకు అతీతమైన పరమసత్యం అని సైన్స్ అంటుంది.

శాస్త్రీయత అనేది కూడా ఒక దృక్కోణమేనని అన్ని దృక్కోణాలలాగ అదికూడా పాక్షిక దృష్టేనని ఆధునికానంతర వాదం పెట్టే విమర్శ ఆధునిక భావాలను బలంగా తాకుతుంది. రాజకీయంగా చెప్పదలచుకున్నప్పుడు అన్ని దృక్కోణాలలాగ శాస్త్రీయత కూడా కొన్ని ప్రయోజనాలకు ప్రతినిధి అని ఆధునికానంతర వాదులు అంటారు. సైన్స్ అనేది ఎప్పటికప్పుడు అపరిపూర్ణమేనని, ఇంకా తెలుసుకోవలసినవి ఉంటాయని నమ్మడానికీ ఈ విమర్శకూ చాలా తేడా ఉంది. మొదటిది ఆధునిక వాదులు ఒప్పుకోలేని విషయం కాదు. అది సైన్స్‌కు అప్పటి దశలో ఉన్న జ్ఞానానికి సంబంధించిన విషయం. రెండవది శాస్త్రీయత స్వభావానికి (దాని తాత్కాలిక పరిమితులకు కాదు) సంబంధించిన విషయం.

ఆధునిక వాదులలో అంతర్గతంగా ఈ చర్చ ఒక కోణం నుండి జరగలేదని కాదు. బూర్జువా ఆధునికతకూ సోషలిస్టు ఆధునికతకూ మధ్య పెద్ద సంవాదమే నడిచింది. బూర్జువా దృక్పథం 'శాస్త్రీయత' అని పిలుచుకునేది యాంత్రికమనీ పాక్షికమనీ - అంటే నిజమైన శాస్త్రీయత కాదనీ వామపక్షవాదులు విమర్శించారు. అది పెట్టుబడిదారుల వర్గ ప్రయోజనాలనూ, పెట్టుబడిదారీ వ్యవస్థనూ కాపాడే 'భావజాలం' అన్నారు. వామపక్ష సిద్ధాంతాలు శాస్త్రీయతను వక్రీకరించి తమ రాజకీయ ప్రయోజనాలకు అనుగుణంగా లోబరుచుకున్నాయని బూర్జువా

విమర్శకులు అన్నారు. అంటే అది నిజమైన శాస్త్రీయత కాదన్నారు. శాస్త్రీయ సోషలిజం కమ్యూనిస్టు పార్టీల నియంతృత్వానికి ఆలంబన ఇచ్చే 'భావజాలం' అన్నారు.

ఆధునికానంతరవాదం పెట్టే చర్చ ఇదికాదు. అది శాస్త్రీయత అనే భావననే తూర్పారబడుతుంది. అది పాక్షిక ప్రయోజనాల ప్రతినిధి అనీ, అది ప్రకటించుకునే సార్వజనీనత అబద్ధమనీ అంటుంది.

నదుల మీద భారీ పెట్టుబడితో పెద్ద ప్రాజెక్టులు కట్టి పెద్ద మొత్తంలో నీరు నిలువ ఉంచి, ఒకేసారి ఎక్కువ సాగుభూమికి నీరు ఇవ్వడం శాస్త్రీయమైన ఆలోచన. దానిని కాదనడం అశాస్త్రీయత, వెనుకబాటుతనం, మూర్ఖత్వం. దాని వలన ముంపుకు గురయి, జీవనం కోల్పోయే వారి గురించి అయ్యో పాపం అనకుండా ఉండము. అంతో యింతో పునరావాసం కల్పించకుండా ఉండము. అంత మాత్రం చేత వారికి ఇబ్బంది కలుగుతుందని చెప్పి శాస్త్రీయ ప్రగతి మార్గాన్ని వదిలిపెట్టగలమా?

ఆలోపతీ వైద్యమొక్కటే శాస్త్రీయ సత్యం మీద ఆధారపడింది. అందువల్ల ప్రభుత్వం వైద్యం మీద పెట్టే ఖర్చంతా అలోపతీ మీదనే పెట్టాలి. ఇతర వైద్య పద్ధతులు అశాస్త్రీయమైనవి, అహేతుకమైనవి. వాటిని విశ్వసించడం మూర్ఖత్వం. అలాంటపుడు ఆ మూర్ఖత్వం మీద ప్రభుత్వం ఖర్చు పెట్టడం అశాస్త్రీయమవుతుంది కదా? అలోపతీ వైద్యం ఖరీదెక్కువ కావడం వల్ల అది పేదలకు అందుబాట్లో లేకపోవచ్చు. ఇతర వైద్య విధానాలు అశాస్త్రీయం కావడం వల్ల ప్రోత్సాహం కరువయి అవి కూడ అందుబాట్లో లేకపోవచ్చు. ఇది దురదృష్టమే కావచ్చును గానీ అంతమాత్రం చేత ప్రభుత్వం అశాస్త్రీయమైన వైద్య విధానాలను ప్రోత్సహించాలనడం సబబు కాదు కదా? ప్రజలు ఏ వైద్యమూ లేకచావడం విచారకరమే, కాని శాస్త్రీయ ప్రమాణాలను కాదని ప్రభుత్వం మూఢత్వాన్ని ప్రోత్సహించవచ్చునా?

చాలా అమాయకంగా చాలామంది ఆమోదించే ఈ శాస్త్రీయ దృక్పథం చాలా క్రూరమైనదని వేరే చెప్పనవసరం లేదు. మతం మార్చుకుంటావా, చంపమంటావా, అంటూ కత్తి పట్టుకొని తలలు కోసే మతవాదుల క్రూరత్వానికి ఇదేమీ తీసిపోదు.

అయితే ఈ ఉదాహరణలు వామపక్షవాదులను పెద్దగా ఇబ్బంది పెట్టవు. వీటిలోని శాస్త్రీయతకు 'బూర్జువా' అన్న విశ్లేషణం తగిలించి తప్పించుకోగలరు. మీరు పరిపాలించినచోట మీ ప్రభుత్వాలు కూడా ఇటువంటి వైఖరే అనుసరించిన ఉదంతాలు లేవా అని అడిగితే, కొన్ని పొరబాట్లు జరిగాయనో, గతితార్కికంగా వ్యవహరించడంలో విఫలమయ్యారనో సర్ది చెప్పగలరు. ఈ విమర్శే ఆధునికానంతర వాదం చెప్పే విషయమయితే అందులో వామపక్షవాదులను మరీ ఎక్కువగా ఇబ్బంది పెట్టే విషయమేమీ లేదు.

కాని సమాజ చారిత్రక క్రమంలో ఉన్న హేతువు (రీజన్) గురించి మార్క్సిజానికి ఉన్న విశ్వాసాన్నే ఆధునికానంతరవాదం ప్రశ్నిస్తుంది. శాస్త్రీయ సోషలిజానికి భూమిక అయిన ఈ చారిత్రక హేతువు కూడ, అలోపతీ వైద్యంలోని శాస్త్రీయతలాగ, చాలా అమాయకంగానే చాలా క్రూరంగా ఉండగలదని విమర్శిస్తుంది. ఈ హేతువు ఒక దృక్కోణం నుండి చేసిన రూపకల్పనే తప్ప అందులో ప్రామాణిక సత్యమేమీ లేదని అంటుంది.

సోవియట్ రష్యాలో శాస్త్రీయ చారిత్రక క్రమానికి వ్యతిరేకంగా, వ్యవసాయ సమిష్టీకరణను తిరస్కరించి, ఇంకా స్వంత ఆస్తిమీద మమకారం పోగొట్టుకోకుండా ఉన్న రైతులతో స్టాలిన్ అతిక్రూరంగా వ్యవహరించాడు. బలత్కారంగా జరిగిన సమిష్టీకరణలో రైతులు లక్షలాదిగా చనిపోయారు. ఇది కేవలం ప్రజల అభీష్టాన్ని ఖాతరు చేయని నియంతృత్వ రాజకీయ ధోరణి మాత్రమే కాదు. సత్యం తమను నడిపిస్తుందన్న శాస్త్రీయ అహంకారం కూడా ఉంది. ప్రాజెక్టు కింద మునిగిపోయే జనావాసాల జీవనాన్ని గురించి అడిగినప్పుడు 'ప్రగతి పథంలో శాస్త్రీయంగా ముందుకు పోవాలంటే ఇటువంటివి అనివార్యం మరి, ఏం చేస్తాం' అని ఇతరత్రా సున్నిత మనస్కులయిన ఆధునికవాదులు సహితం అనగలిగినట్టు, స్టాలిన్ చేసిన బలవంతపు వ్యవసాయ సమిష్టీకరణ గురించి కూడా ఇతరత్రా సున్నిత మనస్కులయిన కమ్యూనిస్టులు 'విప్లవ క్రమంలో తిరోగామి శక్తులపైన పోరాటం అనివార్యం మరి, ఏం చేస్తాం' అంటారు. మామూలుగా వీటిలో మొదటి దానిని 'బూర్జువా అభివృద్ధి'కి స్వాభావికమైన అణచివేత వైఖరిగాను, రెండవ దానిని విప్లవం కోసం పడే ఆరాటంలో జరిగే తొందరపాటు ధోరణిగాను అర్థం చేసుకోవడం జరుగుతుంది. కానీ ఇక్కడున్నది కేవలం అభివృద్ధి, విప్లవం అనే ఆకాంక్షలు మాత్రమే కాదు. ఈ రెండు దృక్పథాలలోనూ అవి కేవలం ఆకాంక్షలు కావు. అవి

శాస్త్రీయ భావనలు. సార్వత్రిక సత్యానికి వాహకమయిన చారిత్రక హేతువు వాటిని నడిపిస్తుంది. శాస్త్రీయ ప్రగతి క్రమాన్ని చారిత్రక హేతువును ఎవరికో నష్టం కలుగుతుందని వదులుకోగలమా అనే సామాన్య వైఖరి ఈ రెండు ధోరణులలోనూ ఉంది. రోగం నయం కావడానికి ఫలాన బాధాకరమైన ఆపరేషన్ తప్పనిసరి అని అమెరికాలో ఎం.ఎస్. చేసివచ్చిన వైద్య శాస్త్రజ్ఞుడు చెప్పిందే తడవుగా, దానివల్ల కలిగే బాధను 'భరించాలి మరి' అని ఇతరత్రా ఇతరుల బాధను చూసి చలించిపోయేవారు సహితం తేలికగా అనగలుగుతారు. ఆ కోవకు చెందినవే ఈ వ్యాఖ్యలు కూడా. నిజానికి 'చారిత్రక క్రమం'లో కలిగే నష్టాలను ఇరు దృక్పథాలూ తరచుగా ఆపరేషన్‌తో పోలుస్తాయి. ఆపరేషన్‌లోని 'శాస్త్రీయ అనివార్యత' రెండు దృక్పథాల ప్రగతి పథంలోనూ ఉంది.

ఇక్కడ ఆధునికానంతరవాదం పెడుతున్న విమర్శ కేవలం నైతిక మానవతా వాద విమర్శకాదు. శాస్త్రీయమే అనుకొన్నా కొంచెం జాలి చూపించవచ్చును కదా? కొంచెం ఉపశమనం కలిగించవచ్చును కదా? అని మాత్రమే అడగడం లేదు. 'శాస్త్రీయం' 'హేతుబద్ధం' అనేవి అన్ని దృక్కోణాలనూ చీల్చి చెండాడగల ప్రామాణిక సత్యాలు కావనీ, అవి ప్రామాణికమైన మహా దృక్పథాలుగా చలామణి అవుతున్న ప్రత్యామ్నాయ దృక్పథాలు మాత్రమేననీ ఆధునికానంతర వాదం అంటుంది. అన్ని దృక్పథాల లాగ ఇవి కూడా కొందరి - లేక కొన్ని - ప్రయోజనాలను కాపాడి ఇతర ప్రయోజనాలను దెబ్బతీస్తాయనీ, వీటిని సత్యానికి ప్రమాణంగా భావించడం అహంభావానికి దారితీస్తుంది తప్ప అందులో నిజమేమీ లేదని అంటుంది.

ఇది కేవలం హితవు కాదు. 'అతి'ని కొంచెం తగ్గించుకొమ్మని చెప్పే విమర్శ కాదు. ఇది జ్ఞాన సిద్ధాంత విమర్శ. అంటే మనిషికి ప్రపంచాన్ని గురించి ఉండే జ్ఞానం స్వభావం ఏమిటి అని చెప్పే తాత్విక సిద్ధాంత రంగానికి చెందిన విమర్శ. ఆధునికమైన అన్ని దృక్పథాలకూ - బూర్జువా దృక్పథాలకూ మార్క్సిజానికీ కూడా - వర్తిస్తుంది.

దీనికి అనుబంధంగా ఆధునికానంతర వాదంలో కొన్ని విలువైన ఆలోచన లున్నాయి. వెలుగు మనకేమి చూపిస్తుందనే విషయం మీద మాత్రమే మనం ప్రధానంగా దృష్టి పెడతాం. ఇది మానవ సహజమైన వైఖరే గాని ఆధునిక దృక్పథాలు దానిని మరింతగా ప్రోత్సహిస్తాయి. ఇంకా ఎక్కువ వెలుతురు ఇచ్చే దీపాలనూ, ఇంకా ఎక్కువ దూరం వెలుగు ప్రసరింపజేసే దీపాలనూ ఆవిష్కరించుకోవడం

శాస్త్రీయత మనకు నేర్పింది. కానీ ప్రతి దీపమూ చూపించే వెలుగులే కాక దాచిపెట్టే చీకట్లు కూడా ఉంటాయనీ, మొదటిది ఎంతగా ఆ దీపం లక్షణమో, రెండవది కూడా అంతేననీ ఆధునికానంతరవాదం ఉంటుంది.

వెలుతురు - చీకటి లాంటిదే శబ్దం - నిశ్శబ్దం కూడా. 'నిశ్శబ్దం' అనేది ఆధునికానంతరవాద పరిభాషలో ఒక ముఖ్యమైన పదం. శబ్దం మీద దృష్టిపెట్టి, దాని అర్థాన్ని సునిశితంగా విశ్లేషించుకోవడం, తప్పొప్పులను హేతుబద్ధంగా వ్యాఖ్యానించుకోవడం ఆధునికవాద శాస్త్రీయత మనకు నేర్పుతుంది. కాని ఒక్కొక్క సిద్ధాంత చట్రానికి ఉండే నైజం వల్ల కొన్ని విషయాలు ఆ సిద్ధాంత విశ్లేషణలో అసలే కనిపించకుండా పోతాయని గుర్తించి వాటిని వెలికి తీయడం అవసరం అని ఆధునికానంతరవాదం మనకు గుర్తుచేస్తుంది.

దృక్కోణం, వ్యాఖ్య, సిద్ధాంతం అనే వాటిని శాస్త్రీయత - అశాస్త్రీయత అనే ప్రమాణాలతో కొలిచినప్పుడు మనం వాటిని చూసే పద్ధతికి, వాటికి అందని చీకట్లనూ, నిశ్శబ్దాన్నీ వెతికి బయటపెట్టాలనుకున్నప్పుడు మనం వాటిని చూసే పద్ధతికి చాలా తేడా ఉంటుంది. ఈ తేడాను మన దృష్టికి తేవడం ఆధునికానంతరవాదం చేసే గొప్ప మేలు.

కులం, జెండర్ అనే రెండు సమస్యలు వామపక్ష సిద్ధాంతవేత్తలకు కనిపించకుండా ఉండడానికి గల సామాజిక కారణం (ఆ సిద్ధాంతవేత్తలంతా అగ్రకులాల పురుషులు కావడం) ఎంత ముఖ్యమో, శాస్త్రీయత తన ప్రత్యేక గుణమని నమ్మే ఆ సిద్ధాంతం ఆ నమ్మకం కారణంగానే తన తర్క చక్షువులకు కనిపించని విషయాలను మానవ చక్షువులతో నిత్యం చూస్తూ ఉండి కూడా గుర్తించలేకపోవడం అంతే ముఖ్యం.

అయినప్పటికీ ఆధునికానంతరవాదం ఆధునికతను అభావం చేయగల నూతన ప్రాపంచిక దృక్పథమని నేను అనుకోవడం లేదు. అది ఆధునికతలోని లోపాలను సవరించడానికీ, దాని అహంభావాన్నీ, స్వాతిశయాన్నీ తగ్గించి, జ్ఞాన సిద్ధాంత సంబంధమైన వినయాన్ని నేర్పించడానికి మాత్రమే పనికొస్తుంది. అది చిన్న విషయం కాదు. కాని అదే సర్వం కాదు.

దీనికి గల తాత్విక కారణాన్ని సూచించి ముగిస్తాను. ఏ సత్యమూ - సైన్స్‌తో సహా పరమ సత్యం కాదనీ, అన్నీ ఒక దృక్కోణానికీ ఒక పరిస్థితికీ సాపేక్షంగా

మాత్రమే సత్యాలనీ గుర్తించిన తరువాత 'ఎంత సత్యం?' అనే తులనాత్మక పరిశీలన చేపట్టడం అవసరం. అంతా సాపేక్షం అని ప్రకటించిన తరువాత 'ఏది ఎప్పుడు ఎంత సాపేక్షం?' అన్న ప్రశ్న వేసుకోవలసి ఉంటుంది. దానికి కావలసిన తార్కిక పరికరాలు రూపొందించుకోవలసి ఉంటుంది. లేకపోతే సాపేక్షమే సర్వం అయిపోయే ప్రమాదం ఉంటుంది. ఇది ఒక కొత్త పిడివాదం అవుతుంది.

ఈ పరికరాలు ఆధునికానంతర వాదం దగ్గర లేవు. వాటి కోసం తిరిగి ఆధునికవాద నమూనాలోని జ్ఞాన సిద్ధాంతాలనే ఆశ్రయించవలసి ఉంటుంది. 'ఏది ఎంత సత్యం?' అన్న ప్రశ్న వేస్తున్నామంటేనే భిన్న సత్యాలను తూకం వేయగల ప్రమాణం ఉందని అర్థం. ఇది 'ఆధునికవాదం' భావించినట్టు - పూర్తి సత్యాన్ని తెలుసుకోగల ప్రామాణిక దృక్కోణం కానక్కరలేదు. ఏ ఒక్క దృష్టికోణానికీ సత్యమంతా దొరుకుతుందని నమ్మకపోయినా, సత్యం అనేది దృష్టి కోణాలకు ఆవల ఉందని నమ్మడం అవసరం. ఒక్కొక్క దృష్టికోణం దానిని ఒక్కొక్క సందర్భంలో ఎక్కువ తక్కువలుగా గ్రహించగలుగుతుందని అప్పుడు గుర్తించగలుగుతాం. ఆ ఎక్కువ తక్కువలను కొలవగల పరికరాలను రూపొందించుకోగలుగుతాం. ఇదేదీ ఆధునికా నంతరవాద చట్రంలో సాధ్యం కాదు. ఆధునికవాద చట్రంలోనే అవుతుంది. అయితే అది ఆధునికానంతరవాదం పెట్టే విమర్శ నుండి నేర్చుకున్న ఆధునిక వాదమైతేనే ఇప్పటిదాకా శాస్త్రీయత, హేతువు అనే భావనలను అంటిపెట్టుకొని ఉన్న అసహనం, క్రూరత్వాల నుండి బయటపడగలుగుతుంది.

మిసిమి మాసపత్రిక
నవంబరు - డిసెంబరు 1999

V

# సమస్యల్లో పుట్టి...సందేహాల్లో మిగిలి



ఒక చారిత్రక ఘట్టాన్ని మనం ఏ విధంగా చూస్తామనేది మనం దానినుండి ఏం ఆశించామనే దాని మీద ఆధారపడి వుంటుంది. ఈ శతాబ్దపు చరిత్రలో ఒక వెలుగు వెలిగి ప్రస్తుతం ఆరిపోయివున్న కమ్యూనిస్టు ప్రయోగానికి కూడా ఇది వర్తిస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థనూ, అది మానవజాతికి అందిచ్చే జీవన విధానాన్నీ విలువలనూ పట్టుదలగా వ్యతిరేకించిన శక్తిగా కమ్యూనిస్టు ప్రయోగాన్ని అర్థం చేసుకున్నట్టయితే దాని జయాపజయాలు ఒక రకంగా కనిపిస్తాయి. సమత మీద, పరస్పర సహకారం మీద ఆధారపడిన నూతన సమాజాన్ని నిర్మించే ప్రయోగంగా అర్థం చేసుకున్నట్టయితే వేరే రకంగా కనిపిస్తాయి. రెండో కోణం నుండి చూసినప్పుడు కమ్యూనిస్టు ప్రయోగంలో వైఫల్యమే ప్రధాన విషయంగా కనిపిస్తుంది. సమత, సహకారాల ప్రాతిపదికన మానవ జీవితాన్ని పునర్నిర్మించడానికి ఏం చేయాలన్న జ్ఞానం అది కొంత ఇచ్చిందిగానీ అంతకంటే ఎక్కువగా ఏం చేయకూడదన్న జ్ఞానమే ఇచ్చింది. అది కూడా జ్ఞానమే కాబట్టి అందుకు సంతోషిద్దామంటే అభ్యంతరం లేదు. కానీ మొదటి కోణం నుండి చూసినప్పుడు కమ్యూనిస్టు ప్రయోగం గొప్పమేలు చేసిందనే చెప్పుకోవాలి. విపరీతమైన అహంకారంతో ప్రపంచాన్ని మొత్తం తన పెత్తనానికి

లోబరుచుకోవడానికి దూకుడుగా ఈ రోజు ముందుకొస్తున్న అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానానికి అడ్డుకట్ట వేయడానికి ఒక సోవియట్ రష్యా అయినా లేకుండా పోయిందే అని సోషలిజాన్ని కాంక్షించేవాళ్లు అనుకోకుండా ఉండలేరు. కమ్యూనిస్టు ప్రయోగమే జరగకుండా ఉండివుంటే ఈ శతాబ్దంలో కార్మికులు, ఇతర పీడిత ప్రజలు, బడుగు దేశాల పరిస్థితి చాలా దయనీయంగా ఉండేదని గడచిన పది సంవత్సరాల కాలంలో మన కళ్ళముందు రూపం తీసుకున్న పరిస్థితులు స్పష్టం చేస్తున్నాయి.

ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టు ఉద్యమానికి వర్తించే ఈ వ్యాఖ్యలు మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రకు కూడా వర్తిస్తాయి. ఒక కోణం నుంచి కొంచెం ఎక్కువే వర్తిస్తాయి. నూతన సమాజ నిర్మాణం ఏ విధంగా జరగ్గలదన్న జ్ఞానాన్ని అందియ్యడంలో మొత్తంగానే కమ్యూనిస్టు ఉద్యమం విఫలమైనా, ఇతర దేశాలలో కొన్ని కొత్త ఆలోచనలను ప్రతిపాదించి ప్రయోగానికి పెట్టిన కమ్యూనిస్టు నాయకులూ, సిద్ధాంతవేత్తలూ ఉన్నారు. బలప్రయోగాన్ని ప్రధాన సాధనంగా భావించినవారిలో లెనిన్, మావోలు; సాంఘిక కృషిని ప్రధాన సాధనంగా ఎంచిన వారిలో గ్రామ్‌సీ ఆ పని చేశారు. కానీ మన రాష్ట్రంలోనే కాదు, మన దేశంలో సహితం కమ్యూనిస్టు ప్రయోగానికి ఒక్క కొత్త ఆలోచన అందిచ్చిన సిద్ధాంతవేత్త గానీ నాయకుడు గానీ లేరు. పార్టీ నాయకులే కాదు, యూనివర్సిటీలోనూ బయటా ఉండే మేధావులలో సహితం, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఎంతో కొంత సమర్థంగా అన్వయించడం చేతనయిన వారుంటే ఉండవచ్చును గానీ ఆ సిద్ధాంతానికి ఒక్క కొత్త ఆలోచనయినా చేర్చినవారు ఒక్కరూ లేరు.

మనకు తెలివితేటలేం తక్కువ లేవు కాబట్టి దీనికి కారణాన్ని తెలివితక్కువ తనంలో కాక మన దేశ తాత్విక సంప్రదాయంలో వెతుక్కోవాలి. బ్రాహ్మణీయ తాత్విక సంప్రదాయం భాష్యకారుల సంప్రదాయం. 'ఇది నేను చెప్తున్నాను' అని ప్రకటించిన బ్రాహ్మణ పండితుడు ఒక్కడూ లేడు. పరిస్థితులు మారుతూ ఉన్నాయి కాబట్టి ఒకసారి కాకపోతే ఒకసారి కొత్తగా మాట్లాడక వారికి కూడా తప్పలేదు గానీ అప్పుడు కూడా 'నేను వేదానికి భాష్యం చెప్తున్నాను' అని మాత్రమే అన్నారు. స్వంత ఆలోచనకు బ్రాహ్మణీయ సంప్రదాయంలో 'లెజిటిమెసీ' లేదు. అది అన్ని ఉద్యమాలలోకీ ప్రవేశించి సిద్ధాంత నిబద్ధత, క్రమశిక్షణ అనే కొత్త పునాదులను వెతుక్కొని గట్టిగా స్థిరపడింది. సమర్థంగా బలప్రయోగం చేయడంలో పీపుల్స్‌వార్

అభివృద్ధి చేసిన అసాధారణమైన నైపుణ్యమొకటి తప్పిస్తే (నూతన సమాజ నిర్మాణానికది ఉపయోగపడుతుందని అనుకుంటే), కమ్యూనిస్టు లక్ష్యసాధన ఏ విధంగా జరగాలన్న విషయంలో సృజనాత్మకమైన చేర్పు ఒక్కటీ మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమం చేయలేదు. మన రాష్ట్రమేమిటి, దేశంలోనే చేయలేదు.

దీని అర్థం కమ్యూనిస్టు ఉద్యమం మన రాష్ట్రంలోనయినా, దేశంలోనయినా సాధించింది ఏమీ లేదని కాదు. మన పొరుగు రాష్ట్రాలయిన ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లను చూస్తే మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమం బలంగా ఉండడం వల్ల ఎంత మేలు జరిగిందో అర్థం అవుతుంది. దోపిడీ, అణచివేత, ప్రతిఘటన, తిరుగుబాటు అనే మాటలు, సమాజాన్ని పాలకవర్గాలు - ప్రజలు అని వర్గీకరించి వీరి భిన్న ప్రయోజ నాలను ప్రాతిపదిక చేసుకుని తర్కించే ఆలోచనారీతి మన సాంఘిక నుడికారంలో భాగం అయిపోయాయి. ఈ నుడికారం ఎరుగని ప్రజలను చూసినప్పుడు తప్ప దీని విలువ ఏమిటో అర్థం కాదు. ఆ నుడికారం తెలిసి వుండి కూడా అణచివేతను అధిగమించలేకపోవడం ఒకెత్తయితే, ఆ భావనలతో పరిచయం లేకపోవడం వల్ల ఏదో అసంతృప్తి అనుభవిస్తూ కూడా అది అణచివేత అని గుర్తించలేక పోవడం వేరొక ఎత్తు. ఇప్పుడీ ఆలోచనలు మన రాష్ట్రంలో అన్ని ఉద్యమాల సామాన్య పరిభాషే గానీ, వాటిని మొదట ప్రవేశపెట్టింది, చాలా అణచివేతకు ఓర్చి ప్రజలకు అలవాటు చేసింది కమ్యూనిస్టులే.

భాష తెలీకపోతే ఏమయింది, భావం తెలీదా అనుకోవడం పొరబాటవుతుంది. భాషే సత్యం అన్న 'ఆధునికానంతరవాద' తాత్విక వైఖరిని ఆమోదించనవసరం లేదు గానీ భాష కేవలం అంతకుముందే మనకు 'తెలిసిన' విషయానికొక వ్యక్తీకరణ సాధనం కాదనీ, బాహ్య వాస్తవికతను వ్యక్తం చేయడంలోనే కాక అది మన ఎరుకలోకి రావడంలో కూడా భాషకు కీలక స్థానం ఉందనీ గుర్తించినట్టయితే అణచివేతను అవ్యక్తమైన అసంతృప్తిగా కాక అణచివేతగానే గుర్తించడంలో కమ్యూనిస్టులు ప్రజలకలవరచిన పరిభాషకు చాలా ప్రాముఖ్యం ఉందని కూడా చూడగలుగుతాం. అయితే కమ్యూనిస్టులు నిర్వహించిన పోరాటాలు భౌతిక ఫలితాలు కూడా చాలా ఇచ్చాయి. ఒక్కొక్క గ్రామంలోనూ ఒక్కొక్క కార్ఖానాలోనూ వచ్చిన ఫలితాలను ఏకరువు పెట్టనక్కరలేదు గానీ ప్రభుత్వ పాలనా విధానాలలో వచ్చిన మార్పులను ప్రస్తావించడం అవసరం. భారత దేశంలో భూసంస్కరణలు శాసన రూపం తీసుకోవడానికొక ముఖ్య కారణం కమ్యూనిస్టులు

నిర్వహించిన భూమి పోరాటాలు. కాగా, 1970లలో సీలింగ్ చట్టాన్ని సవరించి బాగా తగ్గించడానికి ప్రత్యక్ష కారణం నక్సలైట్ ఉద్యమం. తానే ఇందిరాగాంధీకి సీలింగ్ చట్టాన్ని సవరించమని సలహా ఇచ్చానని పి.వి.నరసింహారావు సగర్వంగా చెప్పుకుంటే చెప్పుకోవచ్చును గాక, అతనికి ఆ ఆలోచన రావడానికి కారణం నక్సలైట్ ఉద్యమం. మన రాష్ట్రంలోనయితే ఆదివాసీలకు ఎంతో కొంత మేలు చేసిన ఐటిడిఎ, గిరిజన సహకార సంఘాల ఏర్పాటు, '1 ఆఫ్ 70' సవరణ శ్రీకాకుళ పోరాటం పర్యవసానంగా వచ్చినవే. ఇటువంటి ఉదాహరణలు ఇంకా కూడా ఇయ్యవచ్చును.

ప్రజల చైతన్యం మీద, ప్రభుత్వ విధానాల మీద కమ్యూనిస్టులకుండిన ప్రభావం కేవలం వారి భౌతిక బలాన్ని బట్టి ఉండలేదు. దానిని మించి ఒక నైతికబలం కమ్యూనిస్టు ఉద్యమానికి ఉండింది. న్యాయానికి నిలబడతారనీ, అవినీతితో రాజీ పడరనీ, త్యాగానికి వెనుకాడరనీ, నిర్బంధానికి భయపడరనీ ఒక అభిప్రాయం ఉండింది. ఈ రోజు ఆ అభిప్రాయం లేనేలేదని అనలేము గాని బాగా బలహీనపడింది. అది బలహీనపడిన మేరకు కమ్యూనిస్టుల ప్రభావం కూడా బలహీనపడింది.

సిపిఐ కాంగ్రెస్‌తో చెలిమి చేసిన నాటి నుండి ఇది మొదలయింది. దానివల్ల భౌతికంగా (అంటే నిర్మాణం పటిష్టతలోనూ, కార్యకర్తల సంఖ్య, నిబద్ధతలలోనూ, ఉద్యమాల బలంలోనూ) సిపిఐ ఏం పొందిందో, ఏం కోల్పోయిందో గానీ నైతికమైన గుర్తింపు, గౌరవం చాలా కోల్పోయింది. తరువాతి కాలంలో ఒక దశాబ్దంపైగా సిపిఐ, సిపిఐ(ఎం)లు రెండూ తెలుగుదేశం పార్టీతో కలగలిసి తిరిగినప్పుడు కూడా ఇదే ఫలితం కలిగింది. కమ్యూనిస్టు సిద్ధాంతంలో నైతికతకు ఒక స్పష్టమైన స్థానం లేకపోవడం వల్ల ఈ విషయాన్ని గుర్తించడం సహితం ఆ పార్టీలకు కష్టమయింది. పాలకవర్గాల దిగజారుడుతనాన్ని నిందించడానికీ, ప్రజలను ఆకర్షించడానికీ అక్కరకొచ్చే సాధనంగా తప్ప నైతికతకు కమ్యూనిస్టులు నమ్మే సిద్ధాంత దృక్పథంలో స్వతంత్రమైన స్థానమేమీ లేదు. 'పోరాట అవసరాలు' దానికంటే ఎందుకు ముఖ్యం కాదో చెప్పగల ప్రమాణమేదీ లేదు. అందువల్ల సిపిఐ, సిపిఐ(ఎం)లు తెలుగుదేశం పార్టీతో పొత్తు పెట్టుకోవడమే గాక ఆ పార్టీ అంతర్గత సంక్షోభాలలో ఆ పార్టీ అధినాయకుడిని వెనకేసుకొచ్చి, అతనిని వ్యతిరేకించినవారిని తెలుగుదేశం కార్యకర్తలతో సమానంగా దుయ్యబట్టిన సందర్భాలనేకం ఉన్నాయి. ఎన్నికల

పొత్తుకు ఇది ఏ విధంగా అవసరం? అన్న సందేహం సహితం వారికి వచ్చినట్లు కనిపించదు.

1960లలోనే అప్పటికి సిపిఐలో అంకురించిన ఈ లక్షణాల కారణంగానే నక్సలైట్ ఉద్యమం ఆవిర్భావాన్ని రాజకీయంగా ఆహ్వానించిన వాళ్లెందరున్నారో నైతికంగా ఆహ్వానించిన వారూ అందరున్నారు. సిపిఐ ఆ తరువాత కాంగ్రెస్‌తో పూర్తిగా కలిసిపోవడం, 1980లలో మన రాష్ట్రంలో సిపిఐ, సిపిఐ(ఎం)లు తెలుగుదేశం పార్టీతో అంతగానూ ఒకటైపోవడం నక్సలైట్ ఉద్యమానికి ఉండే ఈ ఆకర్షణను పెంచింది.'వాళ్ల సిద్ధాంతాలతో విభేదిస్తాను గానీ వాళ్ల నిజాయితీనీ, విలువలనూ గౌరవిస్తాను' అని 1990 దాకా కూడా తెలంగాణలో నక్సలైట్ల గురించి అనే వాళ్లుండేవారు. ఇప్పుడా పరిస్థితి నక్సలైట్ ఉద్యమానికి కూడా బాగా తగ్గింది. దీనికి దృష్టాంతాలూ, తార్కాణాలూ ఏకరువు పెట్టనవసరం లేదు.

ఈ బలాన్ని అన్ని కమ్యూనిస్టు పార్టీలు తిరిగి పొందడం అవసరం. సిపిఐ, సిపిఐ(ఎం)లు చాలాకాలం తరువాత స్వతంత్రంగా పనిచేస్తున్నాయి. ఇది కేవలం ఒక తాత్కాలికమైన ఎత్తుగడ కాదనీ, సూత్రబద్ధమైన నిర్ణయమనీ ప్రజలను నమ్మించ గలిగితే (అదసలు నిజమైతే) వ్యవస్థను విమర్శించే నైతిక అర్హతను తిరిగి పొందగలుగుతాయి. దానివల్ల రాగల బలం అంతా ఇంతా కాదు. నక్సలైట్ పార్టీలు కూడా డబ్బుల సేకరణలో, బలప్రయోగంలో, సమస్యలను ఎదుర్కొనడానికి వేసే ఎత్తుగడలలో, తమ మధ్య ఉన్న అంతర్గత కలహాలను పరిష్కరించుకోవడానికి అనుసరించే విధానాలలో, ప్రజలలో పనిచేస్తున్న ఇతర ఉద్యమాలతో వ్యవహరించే పద్ధతిలో కొన్ని ప్రామాణికమైన విలువలను పాటించడం నేర్చుకోవాలి. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వల్ల పేద, పీడిత ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలలో వారికి అండగా నిలిచే పాత్ర కమ్యూనిస్టులు పోషించాలంటే ఇది కనీస అవసరం. అంతకుమించి కమ్యూనిస్టు ఉద్యమం తన లక్ష్యమైన సమసమాజం వైపు పురోగమించాలంటే ఇది కేవలం ఆచరణకు సంబంధించిన పై మార్పులు సరిపోవు. సిద్ధాంత వివేచన కూడా చాలా అవసరం. కానీ ఈ మధ్యకాలంలో బలంగా చర్చకు వచ్చిన ముఖ్యమైన సైద్ధాంతిక సందేహాలకు సహితం కమ్యూనిస్టు పార్టీలేవీ సంతృప్తికరమైన సమాధానం చెప్పలేకపోయాయి. పార్టీలే కాదు, సిద్ధాంత రంగంలో కృషి చేయడమే తమ ప్రధాన పాత్ర అయిన మేధావులు సహితం చెప్పలేకపోయారు. కులం, జెండర్ అనే రెండింటిని ఉదాహరణగా తీసుకోవచ్చు. వీటిని చారిత్రక

భౌతికవాదం ఏ విధంగా వివరిస్తుందనే ప్రశ్నకు తమ సంతృప్తి కోసం ఏదో ఒక జవాబు చెప్పుకోవడం తప్ప ఇతరులను - అందరినీ కాకపోయినా ఒకరిద్దరినయినా - ఒప్పించగల వివరణ ఏదీ ఇవ్వలేక పోయారు.

ఈ సిద్ధాంత లోపాన్ని కమ్యూనిస్టు ఉద్యమం ఎప్పటికయినా అధిగమించ గలదో లేదో గానీ పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా, పేదలకు అండగా నిలబడే పాత్ర ఏదయితే కమ్యూనిస్టు ఉద్యమం సమర్థంగానే నిర్వహించగలదని ఈ శతాబ్దపు చరిత్ర రుజువు చేసిందో ఆ పాత్రను తిరిగి శక్తివంతంగా నిర్వహించడానికి అవసరమైన భౌతిక బలాన్ని, నైతిక సాధికారతనూ అది తిరిగి పొందుతుందని ఆశిద్దాం. రాబోయే రోజులలో అది చాలా అవసరం అవుతుంది.

వార్త దినపత్రిక
24 డిసెంబర్ 1999

V

# ఎరిక్ ఫ్రామ్ : మనిషిని మనిషిగా స్వీకరించే సోషలిజం



'సామాజిక అస్తిత్వం సామాజిన చైతన్యానికి పునాది' అన్నది మార్క్సిజంలోని ప్రధాన సూత్రాలలో ఒకటి. మార్క్సుకు ముందు ఈ విషయాన్ని ఎవరూ గుర్తించ లేదనడం అవాస్తవమవుతుంది. ఆ విధంగా మార్క్స్ కూడా ఎప్పుడూ అనలేదు. నిజానికి ఈ సూత్రంలోని 'పునాది' అనే మాటను అది సూచించే సంబంధాన్ని ఏ విధంగా అర్థం చేసుకుంటామనే విషయంలో తేడాలుంటాయి గానీ, సామాజిక జీవితాన్ని గురించి మనుషులు చేసే ఆలోచనలను శాస్త్రీయంగా విశ్లేషించే వారెవరైనా సామాజిక అస్తిత్వం మీద మొదట దృష్టి పెట్టక తప్పదు.

అయినప్పటికీ సంప్రదాయక ('భావవాద') సామాజిక తత్వశాస్త్రం మీద ఈ ('భౌతికవాద') సూత్రాన్ని ఆయుధంగా సంధించి ఒక సమగ్రమైన చారిత్రక సిద్ధాంతాన్ని ఆ ప్రాతిపదిక మీద నిర్మించిన ఘనత మార్క్సుకే దక్కుతుంది. ఆలోచనలకు జీవితం పునాది అనే ఈ భౌతికవాద సూత్రం (అందులో ఎన్ని తాత్వికసమస్యలున్నప్పటికీ) ఈ రోజు ఎంతగా మన 'కామన్‌సెన్స్'లో భాగమయిపోయిందంటే 'అదేం పెద్ద గొప్ప సిద్ధాంతమా?' అని ఎవరైనా ఆశ్చర్యంగా అడగొచ్చు. అయితే అది మనుషుల సామాన్య ఆలోచనారీతిలో భాగం కావడం మార్క్సిజం సాధించిన విజయమేనని చెప్పక తప్పదు. సామాన్య మానవ

ఆలోచనారీతిలో భాగమయిపోవడమే ఒక ఆలోచన సాధించగల అతిగొప్ప విజయమనుకుంటే మార్క్సిస్టు భౌతికవాదం ఆ విజయాన్ని సాధించినట్టే.

అంత మాత్రం చేత అందులోని తాత్విక సమస్యలు పరిష్కారమయి పోయినట్టు కాదు. సామాన్య మానవ ఆలోచనా రీతులలో తాత్వికంగా సమస్యాత్మక మైనవి అనేకం ఉంటాయి కాబట్టి ఇక్కడ వైరుధ్యమేం లేదు.

మనుషుల చైతన్యాన్ని వారి భౌతిక అస్తిత్వం నిర్ణయిస్తుందని ఎందుకు భావించాలి? నిర్ణయించే ఆ క్రమం ఏమిటి? ఆ అభిప్రాయానికి రుజువేమిటి? ప్రపంచంలో మనకు కనిపించే విభిన్నమయిన మానవ ఆలోచనా రీతులను అర్థం చేసుకోవడానికది సరిపోతుందా? పూర్తిగా వ్యక్తిగతమైన ఆలోచనా రీతులను ఒక పక్కన పెట్టినా! సామాజిక ఆలోచనా ప్రవంతులను అర్థం చేసుకోవడానికి సరిపోతుందా? నాజీ వాదాన్నీ, గాంధీ వాదాన్నీ, మత అసహనాన్నీ, సూఫీ వాదాన్నీ, మదర్ థెరెసాను, అణుయుద్ధ దాహాన్నీ, అన్నిటినీ అర్థం చేసుకోవడానికి సరి పోతుందా?

ఈ ప్రశ్నలు వేసుకోవడానికి సాహసించిన మార్క్సిస్టులలో ఎరిక్ ఫ్రామ్ ఒకరు. బహుశా ఒక్కరేనని కూడా అనవచ్చునేమో. తనకూ తన తరం యూరోపియన్లకూ బాగా పరిచయం ఉన్న నాజీ వాదాన్నీ, యుద్ధోన్మాదాన్నీ, పెట్టుబడిదారీ సరుకుల దాహాన్నీ ఉదాహరణలుగా తీసుకొని అతను ఈ ప్రశ్నలకు జవాబు చెప్పే ప్రయత్నం చేసాడు. విజయం సాధించాడని అనలేము గానీ చాలా విలువయిన విశ్లేషణ చేసాడు.

ఎరిక్ ఫ్రామ్ గొప్ప ఆశావాది. అతనిది తెచ్చిపెట్టుకున్న ఆశావాదం కాదు, స్వచ్ఛమైన ఆశావాదం. అది అవాస్తవికమయినా దానిని గౌరవించవచ్చును. మార్క్స్ ఆలోచనల తాత్విక మూలాలలోనే మానవ అస్తిత్వాన్ని గురించి, నైజాన్ని గురించి బలమైన ఆశావాదం ఉంది. అయితే మార్క్సిస్టులందరూ స్వచ్ఛమైన ఆశావాదులు కాదు. 'బడితె చేతిలో ఉంటే ఈ ప్రపంచం బాగుపడక చస్తుందా' అనుకునే వాళ్లు చాలామంది ఉన్నారు. మార్క్సిస్టులు అధికారానికి దగ్గరయ్యే కొద్దీ వీరి సంఖ్యే మెజారిటీ అవుతూ ఉంటుంది. దీనికి కారణం కూడా మార్క్స్ సిద్ధాంతంలోనే ఉంది గానీ ఆ విశ్లేషణలోకి పోవడానికిది సందర్భం కాదు.

మనుషుల చైతన్యం మెదడుకు సంబంధించినది (ఆలోచనలు తలలో ఉంటాయి) అనుకున్నంత కాలం, చైతన్యాన్ని అస్తిత్వం నిర్ణయిస్తుందన్న సూత్రాన్ని 'రుజువు' చేయడం సులభమే. అయితే దానివల్ల మనకు అర్థం అయ్యేది స్వల్పమే.

ఒక చెట్టు ఏ విధంగా ఉంటుందో, ఆ చెట్టుకు సంబంధించి మన ఆలోచనలలో ఉండే చిత్రం కూడా అదే విధంగా ఉంటుంది కదా. కాబట్టి మన జీవిత నైజం ఎట్టిదో దానిని గురించి మనకుండే చైతన్యమూ అట్టిదే.

దీనిని 'ప్రతిఫలన సిద్ధాంతం' అంటారు. దీనిని మనుషులకు చెట్ల స్వరూపాన్ని గురించి ఉండే జ్ఞానానికే కాక, సామాజిక చైతన్యానికి కూడా అన్వయించడంలో ఉండే ఇబ్బందిని భౌతికవాదులు తొలినాడే గమనించారు. మనుషులలో చాలా మందికి తమ జీవిత ప్రయోజనాలకు వ్యతిరేకమైన ఆలోచనలుంటాయి. కాబట్టి చైతన్యం అస్తిత్వాన్ని ఉన్నదున్నట్టు ప్రతిబింబిస్తుందని నమ్మకూడదని భౌతికవాద తత్వవేత్తలు అనసాగారు. సామాజిక అస్తిత్వమే తన అసలు నైజాన్ని కప్పిపెట్టి తలకిందులుగా కనిపిస్తుందని (ఇది ప్రత్యేకించి పెట్టుబడిదారీ 'సరుకుల మాయ'కు ఉండే లక్షణమని), పాలకవర్గాలకు ఆలోచనల సాధికారతపైన ఉండే ఆధిపత్యం వల్ల వారి ప్రయోజనాలే పాలితవర్గాల ప్రయోజనాలుగా వారు ప్రచారం చేయగలుగు తారని, ఇత్యాది కారణాలవల్ల సామాజిక చైతన్యం సామాజిక అస్తిత్వాన్ని ఉన్నదున్నట్టు ప్రతిబింబించదని అనసాగారు.

ఈ సవరణతో స్వీకరించినా చరిత్రలో కనిపించే అన్ని రకాల చైతన్య రీతులనూ - పైన చెప్పినట్టు నాజీ వాదం నుండి మదర్ థెరిసా దాకా - ఈ సిద్ధాంతం వివరించగలదని నమ్మటం కష్టం. కానీ ఇంతకంటే మెరుగయిన వివరణ ప్రతిఫలన సిద్ధాంతంలో లేదు. దానిని సవరించే హెచ్చరికలలోనూ లేదు.

కానీ మనస్తత్వ శాస్త్రం - ముఖ్యంగా సైకో ఎనాలిసిస్ - అభివృద్ధి చెందిన క్రమంలో చైతన్యం మెదడుకు సంబంధించిన విషయం కాదనీ, వ్యక్తిత్వానికి సంబంధించిన విషయమనీ అర్థమయింది. అప్పుడు చైతన్యాన్ని వివరించడానికి చెట్టు సామ్యం ఎందుకూ కొరగాదు. ఇంకా సరిగ్గా చెప్పాలంటే చైతన్యానికి సంబంధించిన భౌతిక ప్రక్రియ - 'ఆలోచించడం' అనే క్రియ - మెదడులోనే జరిగిన ప్పటికీ చైతన్యానికి సంబంధించిన వస్తువు లేక విషయం మెదడుకు కాక వ్యక్తిత్వానికి చెందినది. చెట్టునో, కుర్చీనో మనం చూడడం అనేది మన వ్యక్తిత్వంతో నిమిత్తం లేని భౌతిక క్రియ కాబట్టి చెట్టు లేక కుర్చీ అనే ఊహ లేక భావన భౌతిక వాస్తవికతకు ప్రతిఫలనం అనడం ఒకెత్తు. సామాజిక చైతన్యాన్ని వివరించడానికి ఇది కనీసం ఒక పోలికగా కూడా పనికిరాదు.

మరి మనిషి వ్యక్తిత్వం ఏ విధంగా రూపం తీసుకుంటుంది? దానిని భౌతిక జీవితమే నిర్ణయిస్తుందని రుజువు చేయగలమా? చేయగలిగినట్టయితేనే మానవ చైతన్యాన్ని మానవ భౌతిక అస్తిత్వం నిర్ణయిస్తుందని చెప్పగలం. ఈ ప్రయత్నం

చేయనంత కాలం మార్క్సిజం - ప్రత్యేకించి, చారిత్రక భౌతికవాదం - అసంపూర్ణంగానే ఉంటుంది.

ఆ ప్రయత్నమే సైకో ఎనాలిసిస్ ప్రాతిపదికగా ఎరిక్ ఫ్రామ్ చేసాడు. కానీ ఫ్రాయిడ్‌ను మౌలికంగానే సవరించి వేసాడు. మానవ లైంగికత (ఫ్రాయిడ్ ఈ మాటను మామూలుగా వాడే అర్థం కంటె విశాలమైన అర్థంలో వాడతాడు) బాల్యంలో వ్యక్తమయ్యే రూపాలకూ కుటుంబ పెద్దల ద్వారా అమలయ్యే సామాజిక నియమాలకూ మధ్య నుండే వైరుధ్యాన్నీ దాని పర్యవసానాలనూ ప్రాతిపదిక చేసుకొని ఫ్రాయిడ్ మనిషి వ్యక్తిత్వం రూపొందే క్రమాన్ని వివరిస్తాడు.

ఎరిక్ ఫ్రామ్ ఫ్రాయిడ్ విశ్లేషణలను అనేక సందర్భాలలో వాడుకుంటాడు గానీ, వ్యక్తిత్వ విశ్లేషణకు వేరే ప్రాతిపదిక ప్రతిపాదిస్తాడు. మానవనైజాన్ని నిర్వచించి దానిని పునాది చేసుకొని తన విశ్లేషణను రూపొందిస్తాడు. మానవ నైజాన్ని నిర్వచించడ మంటే మనుషులు ప్రాథమికంగా మంచివారని గానీ, ప్రాథమికంగా చెడ్డవారని గానీ ప్రకటించడం కాదు. మానవ అస్తిత్వ నైజాన్ని (ఆంటాలజీ - ontology) వివరించడం.

మార్క్సుకు ముందు తత్వవేత్తలందరూ మానవ నైజాన్ని సూత్రీకరించారని, మార్క్సు ఆ పని చేయలేదని ప్రతీతి. మార్క్సిస్టులలో ఇతరత్రా విభేదాలున్నా వారు కూడా (గ్రామ్‌సీ, లెనిన్, అల్తూజర్‌లను ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు) ఈ మాటే అంటారు. అనడమే కాక దానిని మార్క్సు విశిష్టతగా భావిస్తారు కూడ. మార్క్సు అటువంటి సూత్రీకరణ చేయక పోవడానికి ఒక కారణం ఉంది. ఆయన దృష్టిలో ఇప్పటివరకు మనిషి నిండయిన మనిషే కాదు. మనిషి తన సృజనశక్తిని అపరిమితంగా అభివృద్ధి చేసుకోవడానికి అవసరమైన భౌతిక ఉత్పాదన శక్తిని సాధించుకున్న తరువాతే అసలయిన మనిషి ఉద్భవించడం జరుగుతుంది. మనిషి 'ఒకరితో అందరూ అందరిలో ఒకరుగా' తన సృజన శక్తిని వెయ్యి రీతుల ఆవిష్కరించుకునే దశ అప్పుడు మొదలవుతుంది. అదే అసలయిన మానవ చరిత్ర. ఆ లోపల ఉన్న మనిషి ఇంకా అవసరాలకూ, అపరిపక్వమైన ఉత్పాదనా శక్తికీ బానిస. ఈ మనిషినే నిర్వచించి, 'మనిషి ఇది, అది' అంటూ సూత్రీకరించడంలో అర్థం లేదు. చేయవలసింది ఈ మనిషి నిజమైన 'మనిషితనాన్ని' సాధించడానికి అవసరమైన ఉత్పాదనశక్తిని పొందే స్థితికి ఎదిగే చారిత్రక క్రమంలోని వైరుధ్యాలను విశ్లేషించడం, వాటిని ముందుకు నడిపించడం. తరువాత రాగల దశకూ ప్రస్తుతం మనం బతుకుతున్న 'చరిత్ర పూర్వ' దశకూ మధ్య ఒక అగాధం ఉంది. దానికి ఆవలా ఈవలా ఏ విషయమూ ఒకటి కాదు. అందువల్ల ఈవల నిలబడి ఆవల ఆవిర్భవించబోయే మనిషిని నిర్వచించడం నిరర్థకం.

నిర్వచనం అక్కరలేదని భావించే ఈ ధోరణిలోనూ ఒక నిర్వచనం ఉంది. అసలయిన చరిత్ర మొదలయినాక మనిషి ఎప్పటికప్పుడు తనను వినూత్నంగా నిర్వచించుకోవడం జరుగుతుంది. నిరంతర పునర్నిర్వచనమే అసలైన మనిషి నైజం. అప్పటివరకు జరిగే చరిత్ర పూర్వ దశ అంతా ఆ స్థితికి బీజమైన అనంత ఉత్పాదన శక్తిని అందుకునే క్రమమే తప్ప వేరే ఏమీ కాదు కాబట్టి, చరిత్ర పూర్వదశలో మనిషి ప్రధాన లక్షణం ఉత్పాదన క్రియ, లేక సృజనాత్మక శ్రమ. అదే ప్రస్తుతానికి మనిషి నైజం. ఆ తరువాత ఒక స్థిరమైన నైజమంటూ లేకపోవడమే మనిషి నైజం.

ఇది ఎందుకయినా పనికొస్తుందేమో గానీ మనం మొదట్లో వేసుకున్న ప్రశ్నకు - సామాజిక అస్తిత్వం సామాజిక చైతన్యాన్ని నిర్ణయించే క్రమం ఎటువంటిది? అనే ప్రశ్నకు - జవాబు చెప్పడానికి మాత్రం పనికిరాదు.

ఎరిక్ ఫ్రామ్ మానవ నైజాన్ని నిర్వచించడం అవసరమని నమ్మిన ఒకే ఒక మార్క్సిస్టు. అయితే దాని అర్థం స్వభావ రీత్యా మనుషులు ప్రాథమికంగా స్వార్థ పరులనో, నిస్వార్థపరులనో, మంచివాళ్ళనో, చెడ్డవాళ్ళనో ప్రకటించడం కాదు; మానవ అస్తిత్వ నైజాన్ని నిర్వచించడం. ఇతర జంతువుల ప్రవర్తన ప్రధానంగా వాటి జన్యువులలోనే నిర్ణయించబడి ఉంటుంది. మనిషిలో జన్యువులు నిర్ణయించేది కొంచెమే. మనిషి అనివార్యంగా తన చుట్టూ ఉన్న పరిసరాలతో - ఇతర మనుషులతో సహా - ప్రయత్న పూర్వకంగా, సంకల్ప పూర్వకంగా వ్యవహరించాలి. ఇది మానవ అస్తిత్వ నైజంలోనే ప్రాథమిక అంశం.

రెండవది ఏమిటంటే తన పరిసరాలతోనూ ఇతర మనుషులతోనూ మనిషి ఏర్పరచుకునే సంబంధాలు స్థూలంగా రెండు రకాలు. మొదటి రకానికి ప్రేమ అనేది సంకేతం. స్నేహం, సహకారం, సానుభూతి, పరస్పరత మొదలయిన గుణాలు ఈ కోవకు చెందినవి. వీటికి ఒక సూచికగా ఫ్రామ్ 'ప్రేమ' అనే మాటను ప్రయోగిస్తాడు. రెండవ రకానికి చెందిన గుణాలకు ఫ్రామ్ పరిభాషలో 'విధ్వంసం' అనే మాట ఒక సూచిక, లేక సంకేతం. ద్వేషం, ఈర్ష్య, ఆధిపత్యం మొదలయినవి ఈ కోవకు చెందిన గుణాలు.

ఈ రెండు రకాలుగా మనుషులు తమ పరిసరాలతో సంబంధాలు నెలకొల్పుకుంటారు. ఇవి రెండూ మానవ సహజమైనవే, ఈ అర్థంలో 'మానవీయ మైనవే.' మనం అమానుషం, అమానవీయం అనేవి కూడ పూర్తిగా మానవీయమైన గుణాలే. ఇతర జంతువులు ఆత్మరక్షణ కోసము, ఆహారం కోసము క్రూరంగా ప్రవర్తిస్తాయి. ఆనందం కోసం క్రూరంగా ప్రవర్తించగల ఏకైక జంతువు మనిషి. (మన అహంకారం ఎంతటిదంటే దీనిని మనం 'పశుత్వం' అంటాం!)

ఒక్కొక్క సామాజిక వ్యవస్థలో, ఒక్కొక్క సామాజిక వర్గంలో ఎదిగే పిల్లలు, బతికే పెద్దల వ్యక్తిత్వాలలో ఈ రెండు కోవలకు చెందిన ప్రవర్తనా రీతులు, గుణాలు, విలువలు, ఆలోచనలు ఏ విధంగా నెలకొంటాయన్న విషయాన్ని ఎరిక్ ఫ్రామ్ తన రచనలలో సైకో ఎనాలిసిస్‌కు చెందిన విశ్లేషణా పరికరాల సహాయంతో విపులంగా వివరిస్తాడు. తద్వారా సామాజిక అస్తిత్వం వ్యక్తిత్వాలనూ ఆపైన చైతన్యాన్నీ నిర్ణయించే తీరును వివరిస్తాడు. వర్గమే అంతిమ నిర్ణాయకశక్తి అన్న తన రాజకీయ విశ్వాసాన్ని 'రుజువు చేసేయడం' కోసం అనేక సాధారణ జీవిత పరిస్థితులకు వర్గ ప్రత్యేకతను ఆపాదిస్తున్నాడన్న సందేహం తరచుగా వచ్చినప్పటికీ, 'ఆర్థిక పునాది'ని మాత్రం విశ్లేషించి మొత్తం వివరించినట్టు ప్రకటించే సగటు మార్క్సిస్టు సామాజిక విశ్లేషణతో పోలిస్తే ఆయన రచనలు చాలా ఆసక్తికరమైనవి. తన సమకాలీన యూరోపియన్ సమాజంలో విధ్వంసం అనేదే ప్రధాన గుణం కావడం ఫాసిజానికి అనుకూలమైన వ్యక్తిత్వాలను తయారు చేసిందని ఫ్రామ్ చాలా ఆసక్తికరంగా వివరిస్తాడు.

విధ్వంసం ప్రేమలాగ ఎప్పుడూ మానవ ప్రవర్తనా రీతులలో ఉండే గుణమేనని ఒప్పుకుంటూ కూడ, ప్రేమదే పైచేయి అయ్యే సామాజిక పరిస్థితుల రూపకల్పన కోసం కృషి చేద్దాం రమ్మని తన పాఠకులను ఫ్రామ్ ఆహ్వానిస్తాడు. ఇది కేవలం సామాజిక పరిస్థితులకు సంబంధించిన విషయమేనా అన్న సందేహం ఫ్రామ్ రచనల నుండే వస్తుంది. ఆ విషయం అతనే చూడలేకపోవడం అతని ఆశావాదం ఫలితం. ఏమయితేనేం ఇది మార్క్సిజాన్ని మానవ భూమిక మీద నిలబెట్టే ప్రయత్నమని చెప్పవచ్చు. తన రాజకీయ సిద్ధాంతం 'హ్యూమనిస్ట్ సోషలిజం' అని ఎరిక్ ఫ్రామ్ అంటాడు. అంటే మనిషి అస్తిత్వ నైజాన్నీ దాని పర్యవసానాలనూ వాస్తవికంగా స్వీకరించే సోషలిస్టు ఆదర్శమని అర్థం. ఆ పర్యవసానాలను ఫ్రామ్ విశ్లేషించే పద్ధతిలో అతని ఆశావాదం నుండీ వర్గ నిర్ణాయక సిద్ధాంతం అవశేషాలనుండి పుట్టిన కప్పదాట్లు అనేకం ఉన్నాయని గుర్తించినప్పటికీ, మనిషిని మనిషిగా స్వీకరించే సోషలిస్టు ఆదర్శాన్ని మించిన రాజకీయ లక్ష్యం వేరే ఉండజాలదని ఒప్పుకోవలసిందే.

మిసిమి మాసపత్రిక
ఏప్రిల్ 2001

V

# ప్రజాస్వామ్య పునాదులపైనే సోషలిజం!



నేపాల్ రాజకీయ పరిణామాల గురించి చాలా వ్యాఖ్యలు వింటున్నాం. వాటన్నిటినీ సమీక్షించడానికి ఒక వ్యాసం సరిపోదు గానీ, నేపాలీ మావోయిస్టులకు లభించింది ఒక చారిత్రాత్మక అవకాశం అన్న విషయాన్ని - ఆ పార్టీతో సహా - ఎంత మంది గుర్తిస్తున్నారు?

ప్రతి చిన్న సందర్భాన్నీ చరిత్రాత్మకం అనడం జర్నలిజం పుణ్యాన అలవాటయి పోయింది కాబట్టి ఇది నిజమైన అర్థంలో చరిత్రాత్మకం అని వివరించాలి.

ప్రజలకు రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నిరాకరించి సోషలిజం నిర్మించాలని చూస్తే అది సాగదన్నది 20వ శతాబ్దపు చరిత్ర నేర్పిన ముఖ్య పాఠాలలో ఒకటి. సోవియట్ రష్యాతో మొదలుపెట్టి యూరప్‌లోని అన్ని కమ్యూనిస్టు పాలిత రాజ్యాలూ పతనం కావడానికి ఏకైక కారణం రాజకీయ ప్రజాస్వామ్యం లోపించడమే కాకపోవచ్చు. అయితే ఆ తరువాత అక్కడ నెలకొన్న పాశ్చాత్య తరహా రాజకీయార్థిక వ్యవస్థలోని పెట్టుబడిదారీ అంశాన్ని ఆ దేశాల ప్రజలు త్వరలోనే నిరసించారు గానీ రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నిరసించలేదు. మళ్లీ కమ్యూనిస్టు లేక సోషలిస్టు పార్టీల పాలనే కోరుకున్నప్పుడు కూడ వారికి వోట్లేసి ఎన్నుకున్నారే తప్ప వారికి నియంతలుగా పట్టం గట్టలేదు.

ఇక మీదట సోషలిజం నిర్మించే ప్రయత్నం ఎక్కడ జరిగినా అది ప్రజాస్వామ్య వ్యవస్థ ద్వారానే జరగక తప్పదు. ఒకవేళ ఒక కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటం ద్వారా అధికారానికి వచ్చినా అది సోషలిస్టు సమాజ నిర్మాణానికి సంబంధించిన కృషిని రాజకీయ ప్రజాస్వామ్యాన్ని గౌరవిస్తూ జరపవలసి ఉంటుంది. ఈ సందేశంతో పాటు, దీనికి అనుసరించవలసిన మార్గమేమిటన్న ప్రశ్నను 20వ శతాబ్దం వదిలి వెళ్లింది.

దీనికి సంబంధించిన సిద్ధాంత చర్చ యూరప్‌లో ఎప్పటినుండో జరుగుతున్నది గానీ కమ్యూనిస్టు పార్టీలు బలంగా ఉన్న మనబోటి దేశాలలో ఎప్పుడూ జరగలేదు. ఇప్పుడూ జరగడం లేదు. అన్ని వైఫల్యాలకు బయట సామ్రాజ్యవాదం, లోపల రివిజనిజం కారణం అన్న విశ్లేషణ మన దగ్గర కమ్యూనిస్టు మేధావులకు సంతృప్తి నిస్తున్నది.

ఈ చర్చను చేసే అవకాశం, దానిని ఆచరణలో పెట్టి మంచిచెడులు గుర్తించే అవకాశం నేపాల్ మావోయిస్టులకు దక్కింది. దానికి కావలసిన విజ్ఞత వారిలో ఉందా అంటే తెలీదనే చెప్పాలి. వారిలో ఇంగ్లీష్ చదువులో కొంచెం ప్రపంచ చరిత్ర 'సిద్ధాంత విశ్లేషణా అలవడ్డవారు మన మార్క్సిస్టు పార్టీ నేతలైన యేచూరి, కారత్‌ల సహ విద్యార్థులనీ, వారు వీరి వద్ద రాజకీయ సలహాలు తీసుకుంటున్నారనీ వింటున్నాం. వీరి రాజకీయ విజ్ఞత ఏపాటిదో మనం చూస్తూనే ఉన్నాము కాబట్టి వీరి సహాధ్యాయుల నుండి ఆశించగలిగింది కొంచెమే. ఇకపోతే చదువుల కోసం ఢిల్లీకి రాకుండ నేపాల్ కొండలలోనే ఉండిపోయినవారు జీవిత అనుభవం నుండి, ప్రజలలో పనిచేసిన అనుభవం నుండి నేర్చుకున్న విజ్ఞత ఏమైనా ఉంటే అది ఇప్పుడు అక్కరకు రావచ్చు. కానీ దాని గురించి మనకేం తెలీదు.

రాజ్యాంగ పరిషత్‌లో అందరికంటె ఎక్కువ సీట్లు మావోయిస్టులకు దక్కాయి గానీ అది మొత్తంలో మూడవ వంతే. అయితే మరొక పెద్ద పార్టీ అయిన సిపిఎస్ (యుఎంఎల్)కు పాలన విధానాలకు సంబంధించిన చాలా విషయాలలో మావోయిస్టులతో ఏకాభిప్రాయం ఉండే ఉండాలి కాబట్టి, రాజ్యాంగ రచనలో వారితో జట్టుకట్టి మెలకువతో మెలిగినట్టయితే సోషలిజాన్ని పాలనా విలువగా వ్యవస్థీకరించే రాజ్యాంగం రాయవచ్చు. రాజ్యాంగాన్ని ఎప్పుడయినా సవరించిన ఈ మౌలిక విలువలకు విరుద్ధంగా తిరగరాయడానికి వీలు లేదన్న నియమం కూడ రాజ్యాంగంలో రాయవచ్చు. ఒకవేళ నేపాలీ కాంగ్రెస్ పార్టీ సోషలిస్టు నమూనా

రాజ్యాంగాన్ని రచించడానికే అడ్డు నిలుస్తే రెండు కమ్యూనిస్టు పార్టీలు ఆ పాయింటు మీదనే రాజీనామా చేసి రాజ్యాంగ పరిషత్‌కు మళ్లీ ఎన్నికలు జరిగే పరిస్థితి కల్పించవచ్చును.

కానీ నేపాల్ మావోయిస్టులు రాజ్యాంగ రచన కంటె ఎక్కువగా మధ్యంతర ప్రభుత్వం మీదనే దృష్టి పెడుతున్నట్టు కనిపిస్తుంది. దానిలో ఎవరికి ఏ పదవు లుండాలన్నది ఒక ముఖ్య వివాదంగా ఉన్నట్టుంది. ఈ అభిప్రాయం నిజం కాకపోవచ్చు. వాస్తవాలు పత్రికలలో వార్తల రూపం తీసుకునే ప్రక్రియ నుండి పుట్టిన భ్రమ కావచ్చు. అయితే ప్రచండ అనే ఆ పార్టీ నాయకుడు ఇస్తున్న ఇంటర్వ్యూలు ఇదే అభిప్రాయం కలిగిస్తున్నాయి.

దానికి తోడు తమ 'ప్రజాసైన్యాన్ని' నిరాయుధీకరించడానికి నిరాకరించడం. అన్ని పార్టీలు ఎన్నికల రంగంలో సమానంగా పోటీ చేయడానికి, రేపు ఆమోదించబోయే రాజ్యాంగ నియమాలకు అనుగుణంగా పరిపాలించడానికి అంగీకరించినప్పుడు ఒకరి దగ్గర మాత్రం సైన్యం ఉండడం ఏ విధంగా సబబు? మొన్నటి ఎన్నికలలో మావోయిస్టులు 'ప్రజాసైన్యం' సహాయంతో వోట్లు పొందారన్న అభియోగం ఎవరూ వేయలేదు గానీ అ అనుమానం ఎప్పుడూ రాకుండ ఉంటుందన్న భరోసా ఏమిటి? ఒకవేళ ప్రస్తుతానికింకా ఇతరులు తమను సమానంగా చూస్తారని, గెలిస్తే పరిపాలించ నిస్తారని నమ్మకం లేనట్టయితే తమ సైన్యం నిరాయుధీకరణకొక గడువయినా సూచించాలి. ఎప్పటికీ ఒక రాజకీయ వ్యవస్థలో ఒక పక్షానికి సాయుధ బలగం ఉండడం ఎట్లా ఆమోదనీయం అవుతుంది? చట్టబద్ధ పాలనకు భరోసా ఏముం టుంది?

నిజానికి రాజ్యాంగ రచన తరువాత మావోయిస్టులు దృష్టి పెట్టవలసింది పరిపాలన పద్ధతుల మీద. సోషలిస్టు రాజ్యాంగాన్ని రాసుకున్నా దానిపట్ల పూర్తి ఏకీభావం లేని పార్టీలు కూడ రాజకీయ రంగంలో ఉంటాయి - సెక్యులర్ రాజ్యాంగం రాసుకున్న భారత రాజకీయ వ్యవస్థలో భారతీయ జనతా పార్టీ ఉన్నట్టు. వారు తమ పద్ధతులలో భ్రమలు కల్పించో భయాలు కల్పించో - ప్రజలను ఆకట్టుకునే ప్రయత్నం చేస్తారు. రాజకీయ ప్రజాస్వామ్యాన్ని స్వీకరించినప్పుడు వారి స్వేచ్ఛను అంగీకరించక తప్పదు. ప్రజాస్వామ్య పద్ధతులలోనే ప్రజలు వారివైపు ఆకర్షితులు కాకుండా అడ్డుకట్ట వేస్తూ ఉండాలి. మళ్ళీ మళ్ళీ సోషలిజాన్ని నిర్మించే సంకల్పం ఉండే పార్టీనే - ఒంటరిగానైనా ఉమ్మడిగానైనా - గెలిచేటట్టు చూసుకోవాలి.

దీనికి రాజకీయ మెలకువలు చాలా నేర్చుకోవాలి. అధికారం - ఆపైన ఆయుధాలు ఉన్నాయని ప్రజలమీద దాదాగిరీ చేసే బలహీనతకు లోను కాకూడదు. ఇప్పటికే మావోయిస్టు పార్టీకి అనుబంధమైన యువ కమ్యూనిస్టు లీగ్ కార్యకర్తలు దూకుడుగా నడుచుకోవడం మానుకోలేదన్న అభియోగాలు ఇతర పార్టీలు చేస్తున్నాయి. ఆ సంస్థను మావోయిస్టులు రద్దు చేయాలన్న ఇతర పార్టీల డిమాండు న్యాయమైనది కాదు. పార్టీకి యువజన సంఘం ఉండడంలో తప్పేమీ లేదు. అయితే వారు ప్రజాస్వామికంగా నడుచుకోవడం నేర్చుకోవాలి. దీని గురించి కూడ మావోయిస్టుల నుండి స్పందన లేదు.

నిజానికి ఆర్థిక రంగంలో తొలి దశలో అవసరమైన రాజీలకు మావోయిస్టులు ఇప్పటికే సిద్ధపడ్డారు. పెట్టుబడిదార్లపైన చర్యలేవీ తీసుకోమనీ, విదేశీ పెట్టుబడిని కూడ ఆహ్వానిస్తామనీ ప్రకటించారు. పెట్టుబడులు బాగా తక్కువ ఉన్న, సాంకేతికంగా వెనుకబడి ఉన్న దేశం నేపాల్. సాంకేతిక పురోగతి సాధించేంత వరకు విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం తప్పనిసరే కావచ్చు.

ఆర్థిక రంగంలో సోషలిస్టు లక్ష్యానికి భిన్నమైన ఈ రాజీలకు సిద్ధపడే విజ్ఞత ప్రదర్శించిన వారు, రాజకీయ రంగంలో సోషలిస్టు భావనలో భాగం కాక తప్పని రాజకీయ ప్రజాస్వామ్యం విషయంలో అదే విజ్ఞత ప్రదర్శించడం లేదన్న అభిప్రాయం నిజమైతే అది దురదృష్టకరమే. కానీ ఆ సందేహం మాత్రం బలంగా కలుగుతున్నది. పరిపాలించినంత కాలం పోరాట దశలో అలవాటయిన పద్ధతులతో సాగించుకోవడం, మళ్ళీ ఎన్నికలొస్తే అదే పద్ధతులలో గెలిచే ప్రయత్నం చేయడం, అది సాధ్యం కాకపోతే రాజకీయ వ్యవస్థ నుండి వైదొలగి 'మమ్మల్ని కొనసాగ నివ్వలేదు' అన్న నింద వేయడం - ఈ ఎత్తుగడ నేపాల్ మావోయిస్టుల మనస్సులలో ఉందా? అందుకోసమేనా 'ప్రజా సైన్యాన్ని' రద్దు చేయడానికి నిరాకరిస్తున్నారు?

ప్రజాతంత్ర
18 మే 2008

V

# ఫ్రాయిడ్



చాలామందికి మామూలుగా తెలిసిన విషయం ఏమిటంటే మనిషి ప్రవర్తనను, మనిషి స్వభావాన్ని వాటిని నిర్ణయించడంలో ఫ్రాయిడ్ లైంగిక సంతృప్తికి చాలా ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు అని. ఒక అర్థంలో అది నిజం కావచ్చును కాని, ఆ మాత్రమే అర్థం చేసుకుంటే అది పూర్తిగా వక్రీకరణ అవుతుంది. అంతే కాకుండా లైంగిక సంతృప్తికి ఫ్రాయిడ్ ఇచ్చిన ప్రాముఖ్యాన్ని పూర్తిగా పక్కనపెట్టినా, ఆయన ఆలోచనలు చాలా విలువైనవి. ఆయన అన్న ఒక ప్రధానమైన విషయం ఏమిటంటే మనిషి శరీరానికి ఒక నిర్మాణం ఉన్నట్టే, మనసుకు కూడా ఒక నిర్మాణం ఉందని శరీర నిర్మాణాన్ని శాస్త్రీయంగా అధ్యయనం చేసినట్లే మనసు నిర్మాణాన్ని కూడా శాస్త్రీయంగా అధ్యయనం చేయవచ్చునని. అన్నప్పుడు మామూలుగా మనం కొన్ని భావాలు, కొంత ఉద్విగ్నత, ద్వేషాలు, మంచీ చెడూ ఇవే అనుకుంటాం అవే కాదు. శరీరంలాగానే మనసు కూడా ఒక నిర్మాణ యుతమైనటువంటి వస్తువు, దానినీ శాస్త్రీయంగా అధ్యయనం చేయవచ్చునని చెప్పాడు. చాలా కీలకమైన అంశం ఏమిటంటే ఆంతరంగిక జీవికి (అంటే మనస్సుకు) బాహ్య పరిస్థితుల నుండి వచ్చేటటువంటి ఒత్తిడులు, విలువలు, ప్రమాణాలు, ఆ రెండింటి మధ్య ఉండే ఘర్షణ, చర్య ప్రతిచర్య - ఇవి మనిషి వ్యక్తిత్వాన్ని రూపొందిస్తాయి. అంటే ఈ చర్య, ప్రతిచర్య, సంఘర్షణ అనేవి

సమతుల్యంగా సాగితే మనిషి నిండుగా ఎదగడం జరుగుతుంది. ఆ చర్య ప్రతిచర్య సంఘర్షణ సంక్షోభంలో పడితే మనిషిలో విధ్వంసకరమైనటువంటి లక్షణాలు పైకి వస్తాయి. లేదా మనము మామూలుగా పిచ్చి, ఉన్మాదం అంటామే. ఆ రూపం కూడా తీసుకోవచ్చును. దాన్నే విపరీత ప్రవర్తన అని కూడా అంటుంటారు.

ఫ్రాయిడ్ ప్రకారం ఆంతరంగిక జీవిని నిర్ణయించేది, నిర్వచించేది లైంగిక సంతృప్తి, ఆ సంతృప్తికి బాహ్య సమాజం ఇచ్చేటటువంటి, ఇవ్వనటువంటి అవకాశం. ఈ అభిప్రాయాన్ని పూర్తిగా పక్కన పెట్టినా - అది కొంత నిజం కావచ్చు, కొంత అతిశయోక్తి కావచ్చు, కొంత సమకాలీన యూరోపియన్ సమాజం యొక్క లక్షణాలను ఆయన సార్వజనీకరించడం కూడా కావచ్చు. కానీ దానిని పూర్తిగా పక్కన పెట్టినా సరే నిర్మాణయుతమైన ఆంతరంగిక జీవికి బాహ్య పరిస్థితుల నుంచి వచ్చే విలువలకు, ప్రమాణాలకు మధ్య వచ్చే ఘర్షణ మనిషి వ్యక్తిత్వాన్ని రూపొందిస్తుందని, ఆ ఘర్షణ లేదా ఆ చర్య - ప్రతిచర్య సఫలం అయినప్పుడు, అంటే అది సమతుల్యంగా సాగినప్పుడు మనుషులు మొత్తం మీద నిండుగా ఉంటారని చెప్పడం విలువైన ఆలోచన. అద్భుతమైన దేవతల్లాగా కాదు, నిండుగా ఉంటారని. ఏ కారణంగానైనా అది సంక్షోభంలో పడితే విధ్వంసం, వైపరీత్యం ముందుకొస్తాయి అనేది చాలా విలువైనటువంటి ఆలోచన. ఇవ్వాళ మనం, ముఖ్యంగా సమకాలీన సమాజంలో చాలా ఎక్కువ విధ్వంసం చూస్తున్నాము. 20వ శతాబ్దపు రెండవ భాగం నుంచి మొదలుపెడితే ఇవ్వాల్టి దాకా చాలా విధ్వంసం చూస్తున్నాము. ఇది ఎక్కడనుంచి వస్తోంది అన్న ప్రశ్న వేసుకుంటే నేను అనుకుంటాను లైంగికత విషయం పూర్తిగా పక్కనబెట్టినా ఫ్రాయిడ్ రూపొందించినటువంటి ఆ ప్రాథమిక మోడల్ ఏదైతే ఉందో అది (ఆ విధ్వంసం మూలాలను తెలుసుకోవడానికి) చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

టీవీ9లో ప్రసారమైంది
6 మే 2006

V

## అనుబంధం

# కె.వి. రమణారెడ్డి లేఖ

Vijayawada
22.1.1997

Dear Sri Balagopal,

Namaste. I hope and trust that this finds you all in good cheer. I owe an explanation to you.

I write this to explain my remark about you as an ‘anti-communist’ in concluding my speech in the Virasam patasala, held recently during the Pongal vacation. After having dwelt at length on Russian literature I launched a tirade against Stalinist excesses and also against the failures of ‘Socialist Realism’ to reflect the aberrations of the so-called Dictatorship of the Proletariat which, in practice, came to personal tyranny of Stalin. What should have led to a ‘semi-state’, Dictatorship of the Proletariat degenerated into a totalitarian State, which was not reflected in socialist realist literature. Lest I be misunderstood by the audience as sharing your explicit views about Marxism in general, I concluded my speech by saying that our philosophical positions regarding the Dictatorship of the Proletariat are identical or similar, I

had to say that I am a firm believer in communism, which you are not any longer. The correspondent of Andhraprabha took this point and gave it a lead saying that KVR called Balagopal an anti-communist. After seeing it the next day, I went up to the dais again and said that our philosophical positions are different and even contradictory, at the same time expressing my utmost regard for you as a remarkable intellectual and a great civil liberties activist. I abhor as much as you do the Naxalite excesses in the name of 'revolutionary violence' even though I continue my commitment to Naxalism and PW.

Please remember me to Mrs. Vasantha Lakshmi and my kisses to your son Prabhatha.

With kind regards

Sincerely,
KVR
(K.V. Ramana Reddy)

V

## అనుబంధం

# బాలగోపాల్ స్పందన

21.2.1997

కె.వి.రమణారెడ్డిగారికి

నమస్తే...మీ ఆరోగ్యం బాగుందా?

మీ ఉత్తరం చదివి నేను మొదట ఆశ్చర్యపోయాను. ఎందుకంటే మీరు నా గురించి ఏదో అన్నట్టు పత్రికలలో వచ్చిన సంగతి నాకు తెలీదు. ఆ తరువాత అడిగి తెలుసుకున్నాను.

నన్ను కమ్యూనిస్టు వ్యతిరేకి అన్నా, మార్క్సిస్టు వ్యతిరేకి అన్నా నాకు చింతా లేదు, సంతోషమూ లేదు. మీరు అనకపోయినా విరసం సభ్యులు చాలామంది అనుకుంటున్నారు. పరవాలేదు. 'మా పక్షాన లేని వాళ్లంతా మా శత్రువులే' అనే తాత్విక వైఖరి ఉన్నవాళ్లకు మూడవ అభిప్రాయం ఒకటి ఉండగలదన్న ఆలోచన సాధ్యం కాదు కాబట్టి వాళ్ల అభిప్రాయాల గురించి బాధపడడం అనవసరం.

నేను పార్లమెంటరీ డెమోక్రసీనీ, పెట్టుబడిదారీ వ్యవస్థనూ సమర్థిస్తున్నానని మీరన్నారని మాత్రం విరసం సభలకు హాజరయిన వారొకరు అన్నారు. నాకు పెట్టుబడిదారీ వ్యవస్థ అంటే అసహ్యం. దానిని మానవ జాతి ఏ విధంగా అధిగ మిస్తుందో ఎవ్వరికీ తెలీదని నేను అనుకుంటున్నాను. మార్క్సిజం పెట్టుబడిదారీ వ్యవస్థను విమర్శించడానికి పనికి వచ్చినంతగా దానిని అధిగమించడానికి పనికిరాదని ఈ శతాబ్దం చరిత్ర రుజువు చేసిందని నా అభిప్రాయం. అది ఏ విధంగా జరగగలదో అర్థం చేసుకోవడానికి మూలాల నుండి పునరాలోచించాలని నేను అనుకుంటున్నాను. దీనికి జవాబు దొరుకుతుందని హామీ ఏమీ లేదు. అయినప్పటికీ అన్వేషణ జరపవలసిందే. పెట్టుబడిదారీ వ్యవస్థతో సరిపెట్టుకోవడం అంటే మానవ జీవితాన్ని

అనైతిక స్థాయిలో ఉంచివేయడమే. మనుషుల మధ్య 'ఉపయోగం' అనేది తప్ప వేరే విలువలేవీ లేని జీవితంతో సరిపెట్టుకోవడమే. ఇది తగదని నా అభిప్రాయం.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విషయం వేరు. అందులోని ప్రాతినిధ్య పాలన అనే సూత్రం చాలా విలువైనదనీ, దానంతటదే 'బూర్జువా' లక్షణం కాదనీ నేను నమ్ముతున్నాను. దానిని మెరుగుపరచుకోవడంలోనే భవిష్యత్తు ఉంది తప్ప తిరస్కరించడంలో లేదని నేను నమ్ముతున్నాను. 'కార్మిక నియంతృత్వం' అనేది కూడ నిజంగా కార్మికుల పాలన కావాలంటే కనీసం కార్మికులయినా ఓటువేసి ఆ ప్రభుత్వాన్ని ఎన్నుకునే హక్కు ఉండాలి. కాకపోతే, ప్రాదేశిక నియోజకవర్గాల బదులు ఉత్పత్తి చేసే స్థలాన్ని బట్టి లేదా ఉత్పత్తి రంగాన్ని బట్టి నియోజకవర్గాలు ఏర్పాటు చేయవచ్చు. అయినా అటువంటి రాజకీయ వ్యవస్థకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం లక్షణాలు చాలా ఉంటాయి. ఓటుహక్కు ఇచ్చిన తరువాత ఒక పార్టీకి మాత్రమే ఓటు వేయాలనడంలో అర్థం లేదు. అంటే అది ఏదో ఒక రూపంలో బహుళ పార్టీ వ్యవస్థ కావాలి. కమ్యూనిస్టు పార్టీయేకాక ఇతర పార్టీలకు కూడ ఉనికిలో ఉండే హక్కు ఉండాలి. కమ్యూనిజం నిజంగానే కార్మికులు అధికంగా ఆశించే లక్ష్యం అయినట్టయితే ఆ బహుళ పార్టీ వ్యవస్థ కమ్యూనిజానికి భిన్నంగా పోకుండా ఉంటుంది. కానీ కార్మికుల మీద కమ్యూనిస్టులకు ఆ నమ్మకం లేదు కాబట్టే కమ్యూనిస్టేతర పార్టీల ఉనికే లేకుండా చేసారు! ఒక్క పార్టీయే ఉండాలనుకున్నప్పుడు ఓటు హక్కు ఇచ్చి ఏం ప్రయోజనం? కాబట్టి అది కూడ లేకుండ పార్టీ నియంతృత్వం నెలకొల్పారు. బహుళపార్టీ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పి, కమ్యూనిజం పట్ల బలమైన సామాజిక కాంక్షను నిత్యకృషి ద్వారా నిలబెట్టగలిగితేనే సోషలిజం సాధ్యం అవుతుంది. అంతే తప్ప స్టాలినిజం తప్పు గానీ కార్మిక నియంతృత్వం రైటే ననడంలో అర్థం లేదని నా అభిప్రాయం.

ఉంటాను.

మీ
బాలగోపాల్

V

# బాలగోపాల్ రచనలు

## పర్‌స్పెక్టివ్స్

1. Probings in the Political Economy of Agrarian Classes & Conflicts - మే 1988
2. కల్లోల కథా చిత్రాలు - డిసెంబర్ 1997
3. రాజ్యం - సంక్షేమం - అక్టోబర్ 2010
4. దళిత - అక్టోబర్ 2011
5. మనిషి మార్క్సిజం - అక్టోబర్ 2012

## మానవ హక్కుల వేదిక

1. హక్కుల ఉద్యమం - తాత్విక దృక్పథం - అక్టోబర్ 2010
2. ఆ శిక్షే ఒక నేరం - ఏప్రిల్ 2012
3. Of Capital And Other Punishments - అక్టోబర్ 2012

## దేవులపల్లి పబ్లికేషన్స్

1. నిగాహ్ - ఏప్రిల్ 2011

## హైదరాబాద్ బుక్‌ట్రస్ట్

1. ప్రాచీన భారతదేశ చరిత్ర డి.డి. కోశాంబి పరిచయం - సెప్టెంబర్ 1986
2. కల్లోల లోయ 50 ఏళ్ళ కశ్మీర్ - జనవరి 2007
3. మతతత్వం పై బాలగోపాల్ - అక్టోబర్ 2010
4. రూపం - సారం సాహిత్యంపై బాలగోపాల్ - అక్టోబర్ 2011

## మట్టి ముద్రణలు

1. జలపాతాలు - జనవరి 2013

## స్నేహ ప్రచురణలు

1. రూపం - సారం - ఏప్రిల్ 1986

## NAVAYANA

1. EAR TO THE GROUND selected writings on class & caste - 2011

---

ఇవి కాక ఇంగ్లిష్ తెలుగు భాషల్లో వివిధ అంశాల మీద బాలగోపాల్ రచనలు కొన్ని బుక్‌లెట్స్‌గా వెలువడ్డాయి.

#  ప ర్ స్పె క్టి వ్స్ ఎందుకోసం

**మా**నవజాతి భవిష్యత్తును గురించి ఇవ్వాళ చాలా చర్చ జరుగుతూ ఉంది. ఏ రకమయిన అసమానతగానీ, అణచివేతగానీ లేని సమాజం కావాలని అభ్యుదయవాదులందరూ కోరుకుంటారు. కానీ ఆ సమాజ స్వరూప స్వభావాలను గురించి ఏకాభిప్రాయం మట్టుకు అభ్యుదయవాదులలో సర్వత్రా లేదు. మార్క్స్ రచనలతో ఒక ప్రామాణికమయిన రూపం తీసుకున్న చర్చ ఈనాటికీ ముగియలేదు. అణచివేతలోనూ అసమానతలోనూ కొత్త కోణాలను చరిత్ర ముందుకు తెచ్చేకొద్దీ చర్చ మరింత వాడిగా సాగుతూ ఉంది. మరింత జటిలం అవుతూ ఉంది. కొత్త కోణాలలో కొన్ని నిజానికి చాలా పాతవే కావడంతో వాటిని ఇన్నాళ్ళూ ఎందుకు చూడలేకపోయామన్న విమర్శ చర్చకు కొంత వేడిని కూడా చేరుస్తూ ఉంది.

ఆ చర్చలో అనేక రకాల దృక్పథాలు గల వ్యక్తులు పాల్గొంటున్నారు. అనేక ఉద్యమాలు పాల్గొంటున్నాయి. అసమానతకూ, అణచివేతకూ కొత్త కోణాలను ఆవిష్కరించేవారు, ఇప్పటికే ఉన్న విప్లవ సిద్ధాంతాలు వాటిని ఆకళింపు చేసుకోలేవనే వారు, అసలు కొత్త కోణాల ఆవిష్కరణే నిరుపయోగ మయిన ప్రయాస అనుకునేవారు, ఇప్పటికి ఉన్న సిద్ధాంతాలే సామాజిక జీవితంలోని అన్ని పార్శ్వాలనూ అవగాహన చేసుకోగలవనుకునే వారు, అసలు 'సిద్ధాంతం', 'నిర్మాణం' అనేవే మానవజాతి వికాసానికి అవరోధం అనుకునే వారు, అభ్యుదయం కోసం ఇప్పటిదాకా జరిగిన ప్రయత్నమంతా వృథా అనుకునేవారు, దాని మంచి చెడుల నుండి గుణపాఠాలు తీసుకోగల మనుకునేవారు, రాజకీయ ఆచరణలో నిమగ్నం అయినవారు, ఆచరణతో నిమిత్తం లేనివారు...ఇంకా అనేకులు ఇవాళ మానవ భవితవ్యాన్ని గురించిన ఈ చర్చలో పాల్గొంటున్నారు.

ఈ చర్చకు సంబంధించి 'ప ర్ స్పె క్టి వ్స్' కు ఒక దృక్పథం ఉంది. మానవ సమాజం గురించీ దాని భవిష్యత్తు గురించీ బుద్ధుడి నుండి ఈనాటిదాకా అనేకులు ఊహలు చేశారు. సిద్ధాంతాలు చేశారు. ఎవ్వరూ కాదనలేని ఆదర్శాలు మన ముందుంచారు. ఆ ఆదర్శాలను సాధించే మార్గాలను ప్రతిపాదించారు. ఈ అన్వేషణకు శాస్త్రీయ ప్రాతిపదిక కల్పించి నేలమీద నిలబెట్టింది మార్క్సిజం. మార్క్స్ రచనలు చేయడం మొదలు పెట్టిన తరువాత చర్చ యావత్తూ ఆయన

ప్రతిపాదించిన అధ్యయన చట్రం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంది. అంగీకరించేవాళ్ళూ, సవరించేవాళ్ళూ, తిరస్కరించే వాళ్ళూ అందరూ దానినే ప్రమాణంగా స్వీకరించారు. ఇవ్వాళ తూర్పు యూరప్, సోవియట్ రష్యా, చైనా దేశాలలో వస్తున్న మార్పుల ఫలితంగా చెలరేగుతున్న చర్చ స్వభావం కూడా ఇందుకు భిన్నంగా లేదు. ఇకమీదట ఉండబోతుందని మేము అనుకోవడం లేదు.

ఇప్పటికీ సిద్ధాంతం ఆచరణలకి సంబంధించిన సమస్యలని మార్క్సిజం అధిగమించిందని చెప్పలేం. పాత సమస్యలు పరిష్కరించుకునే క్రమంలో కొత్త సవాళ్ళు మార్క్సిజం ముంగిట కొస్తున్నాయి. కొత్త నిర్వచనాలు, కొత్త ప్రతిపాదనలు, ప్రత్యామ్నాయాలు రూపొందుతున్నాయి. సామాజిక పరివర్తన కోసం జరుగుతున్న మొత్తం చర్చలో భాగమే మార్క్సిజం గురించిన చర్చ కూడా. ఈ చర్చలో అన్ని కోణాలకూ అన్ని పోకడలకూ వేదిక కల్పించాలని 'పర్స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆర్థిక పరిమితుల వల్ల అన్ని పుస్తకాలు ప్రచురించ వీలుకాకున్నా, ఆ దిశగా చర్చను ప్రతిపాదించే పుస్తకాలను ప్రచురించాలనుకుంటున్నాం.

అణచివేతనూ, అసమానతనూ వ్యతిరేకించేది ఏదయినా ప్రజాస్వామిక దృక్పథమే. మౌలికంగా అభ్యుదయ దృక్పథమే. ఆపైన ఎన్ని తేడాలున్నా వినదగినదే, చర్చించదగినదే, అధ్యయనం చేయదగినదే. ***'నూరు పూలు వికసించనీ, వేయి ఆలోచనలు సంఘర్షించనీ'*** అని మావో ఒక చారిత్రక సందర్భంలో ఇచ్చిన పిలుపుకు ఈ నిర్దిష్టమయిన అర్థంలో సార్వత్రిక ప్రాతిపదిక ఉందని 'పర్స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆ అవగాహనతో ప్రచురణలు చేపడుతోంది. ప్రజాస్వామిక స్వభావం కలిగిన సమర్థవంత మయిన రచనలను ఎక్కువగా తెలుగులో, వీలున్నప్పుడు ఇంగ్లీషు, హిందీలో కూడా ప్రచురించడం ద్వారా కొనసాగుతున్న 'గ్రేట్ డిబేట్'కు దోహదం చేయాలని మా సంకల్పం.

మే
1999

కె. బాలగోపాల్
పర్స్పెక్టివ్స్
సామాజిక శాస్త్రం / సాహిత్యం
హైదరాబాదు




# 1988 నుంచి 2012
# పర్స్పెక్టివ్స్ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| O | 1. Probings in the Political Economy of Agrarian classes and Conflicts - | May 1988 | by K. Balagopal<br>Ed. G. Haragopal |
| O | 2. సహచరులు - | జూలై 1989 | వరవరరావు |
| O | 3. పతంజలి భాష్యం - | జూలై 1989 | కె.ఎన్.వై. పతంజలి |
| O | 4. సృజన సంపాదకీయాలు | జనవరి 1990 | వరవరరావు/సాహితీ మిత్రులు |
| O | 5. అభివృద్ధి వెలుగునీడలు | మే 1990 | ఆర్.ఎస్.రావు |
| O | 6. కఠోర షడ్జమాలు - | తొలి ముద్రణ 1990<br>మలి ముద్రణ 1996 | వసంత కన్నబిరాన్ |
| O | 7. మతవర్గ తత్వం - | ఫిబ్రవరి 1991 | ఎడిటర్స్ : హరి, జి. హరగోపాల్ |
| O | 8. ఇలా మిగిలేం - | తొలి ముద్రణ 1991<br>మలి ముద్రణ 1993 | చలసాని ప్రసాదరావు |
| O | 9. పరాధీన భారతం | తొలి ముద్రణ 1992<br>మలి ముద్రణ 1993 | ఎ.బి.కె. ప్రసాద్ |
| O | 10. డంకెల్ దుశ్శాసనం | జూన్ 1993 | నూర్ భాషా |
| O | 11. దినదినగండం | సెప్టెంబర్ 1993 | అనువాదం :<br>కోదండ రామిరెడ్డి |
| O | 12. మన చలం - | మే 1994 | ఎడిటర్ : కృష్ణాబాయి |
| | 13. Towards Understanding Semi Feudal Semi Colonial Society | Jan 1995 | by R.S. Rao<br>Ed. D. Narasimha Reddy |
| O | 14. ఏడోసారా కథ | జూలై 1995 | బుర్ర రాములు |
| O | 15. శాక్కొ - వాంజెట్టి | నవంబర్ 1995 | బి. చంద్రశేఖర్ |
| O | 16. బంగారమ్మ కథ | జనవరి 1996 | అనువాదం - కృష్ణాబాయి |

| | | |
|---|---|---|
| O 17. కార్టూన్ కబుర్లు - | సెప్టెంబరు 1996 | మోహన్ |
| 18. నాకో పిస్తోల్ కావాలి - | అక్టోబర్ 1996 | అనువాదం :<br>చలసాని ప్రసాదరావు |
| 19. సాహిత్యంలో వస్తు శిల్పాలు | మార్చ్ 1997 | త్రిపురనేని మధుసూదనరావు |
| O 20. కల్లోల కథా చిత్రాలు | డిసెంబర్ 1997 | కె. బాలగోపాల్<br>ఎడిటర్ : చలసాని ప్రసాద్ |
| O 21. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక<br>సంస్కరణలు/<br>ప్రపంచబ్యాంక్ ఎజెండా | మార్చ్ 1998 | ఎడిటర్ : డి. నరసింహారెడ్డి |
| O 22. మూడు దశాబ్దాల<br>నక్సల్బరీ గమ్యం-గమనం | తొలి ముద్రణ<br>ఆగస్ట్ 98<br>మలి ముద్రణ<br>అక్టోబర్ 98 | ఎడిటర్స్ :<br>ఎస్. సుధాకర్,<br>ఎం. కోదండరామిరెడ్డి |
| O 23. పరాధీన భారతంలో<br>దారితప్పిన రూపాయి | డిసెంబర్ 98 | ఎ.బి.కె. ప్రసాద్ |
| O 24. శారద నవలలు<br>(ఏది సత్యం, మంచీ-చెడు,<br>అపస్వరాలు) | ఆగస్ట్ 99 | శారద (ఎస్. నటరాజన్) |
| O 25. సింగరేణి | నవంబర్ 2000 | ఎం.డి. మునీర్ , ఎం.డి. అన్వర్ |
| O 26. ఖాదర్ లేడు | మే 2001 | మహమ్మద్ ఖదీర్ బాబు |
| O 27. ప్రమాదంలో ప్రజారోగ్యం | ఫిబ్రవరి 2002 | డా॥ ఎస్. తిరుపతయ్య<br>డా॥ పి. జగదీశ్వర్ |
| O 28. ఎన్జీవోల కథ | జనవరి 2003 | బి. చంద్రశేఖర్ |
| O 29. జాగ్తే రహో | జూన్ 2003 | చలసాని ప్రసాదరావు<br>ఎడిటర్ : డి. వెంకట్రామయ్య |
| O 30. ఉదయగీతిక<br>(రెండవ కూర్పు తొలిముద్రణ) | డిసెంబర్ 2003 | రచన - యాంగ్ మో<br>అనువాదం : ఎన్. వేణుగోపాల్ |
| O 31. వరల్డ్ సోషల్ ఫోరం | జనవరి | **RUPE (MUMBAI)** |

| | | |
|---|---|---|
| ఆర్థిక రాజకీయాలు | 2004 | అనువాదం : బి. చంద్రశేఖర్ |
| O 32. ఎర్రమందారాలు | మే | రచన-లోకువాంగ్-పిన్ |
| (రెండవ కూర్పు | 2005 | యాంగ్ యీ-యెన్ |
| తొలి ముద్రణ) | | అనువాదం : డా॥ టి.నళిని |
| O 33. నూరేళ్ళ తెలుగు | ఆగస్ట్ | సహవాసి |
| నవల (1878-1977) | 2007 | సంపాదకులు- డి. వెంకట్రామయ్య |
| 34. అల్లంరాజయ్య | జనవరి | అల్లం రాజయ్య |
| సాహిత్యం -1 | 2008 | సంపాదకులు-వరవరరావు |
| మూడు నవలలు- | | |
| 35. విభిన్న | ఆగష్టు 2008 | హరిపురుషోత్తమరావు |
| 36. పతంజలి భాష్యం | మార్చ్ 2009 | కె.ఎన్.వై.పతంజలి |
| 37. మృగన | ఏప్రిల్ 2009 | విమల |
| 38. రాజ్యం - సంక్షేమం | అక్టోబర్ 2010 | కె. బాలగోపాల్ |
| 39. అల్లం రాజయ్య | ఏప్రిల్ 2011 | అల్లం రాజయ్య |
| సాహిత్యం-2 | | సంపాదకులు-వరవరరావు |
| సృష్టికర్తలు (కథలు) | | |
| 40. సంభాషణ | జులై 2011 | కె. శ్రీనివాస్ |
| 41. దళిత | అక్టోబర్ 2011 | కె. బాలగోపాల్ |
| 42. జాజిమల్లి (మొదటి ముద్రణ) | డిసెంబర్ 2011 | మల్లీశ్వరి |
| (రెండవ ముద్రణ) | ఏప్రిల్ 2012 | |
| 43. త్రిపుర (కథలు) | డిసెంబర్ 2011 | త్రిపుర |
| 44. ప్రాణహిత (మొదటి ముద్రణ) | జులై 2012 | అల్లం నారాయణ |
| (రెండవ ముద్రణ) | సెప్టెంబర్ 2012 | |
| 45. మనిషి మార్క్సిజం | | కె. బాలగోపాల్ |
| (మొదటి ముద్రణ) | అక్టోబర్ 2012 | |
| (రెండవ ముద్రణ) | డిసెంబర్ 2012 | |

**P e r s p e c t i v e s**
***Social Sciences / Literature***
**Publishing *for* Change**



**manishi marxism**
essays in telugu
reflections on human agency,
social movements & marxism *by* k. balagopal

నాకు పెట్టుబడిదారీ వ్యవస్థ అంటే అసహ్యం. దానిని మానవ జాతి ఏ విధంగా అధిగమిస్తుందో ఎవ్వరికీ తెలీదని నేను అనుకుంటున్నాను. మార్క్సిజం పెట్టుబడిదారీ వ్యవస్థను విమర్శించడానికి పనికి వచ్చినంతగా దానిని అధిగమించడానికి పనికి రాదని ఈ శతాబ్దం చరిత్ర రుజువు చేసిందని నా అభిప్రాయం. అది ఏ విధంగా జరగగలదో అర్థం చేసుకోవడానికి మూలాల నుండి పునరాలోచించాలని నేను అనుకుంటున్నాను. దీనికి జవాబు దొరుకుతుందని హామీ ఏమీ లేదు. అయినప్పటికీ అన్వేషణ జరపవలసిందే.

పెట్టుబడిదారీ వ్యవస్థతో సరిపెట్టుకోవడం అంటే మానవ జీవితాన్ని అనైతిక స్థాయిలో ఉంచి వేయడమే. మనుషుల మధ్య 'ఉపయోగం' అనేది తప్ప వేరే విలువలేవీ లేని జీవితంతో సరిపెట్టుకోవడమే. ఇది తగదని నా అభిప్రాయం.




**Perspectives**
Social Sciences/Literature
Publishing *for* Change

₹ 100/-

ISBN 978-93-81172-02-5

